# తీర్పు

[నవలిక]

రచన:

ధనికొండ హనుమంతరావు

ప్రచురణ:

జ్యోతి కార్యాలయం,

మద్రాసు-17

# తీర్పు

సూర్యుని లేత కిరణాలు కిటికీలోంచి ముఖం మీద పడి, కళ్యాణిని అప్పుడే మేల్కొల్పినయ్. ఆమె ఒళ్ళు విరుచుకొని, బద్ధకంగా పక్కమీద లేచి కూర్చొని పక్కగదిలో జరిగే సంభాషణను వినసాగింది—

"...ఏమిమ్మంటావ్ ?"

"మీ ఇష్టం—"

"అదెట్లా ? ఇదివర కతనికి ముప్పై ఇచ్చేవాళ్ళం"

"నాకూ అలాగే ఇప్పించండి"

"ఎప్పటి నుంచీ రాగలవు ?"

"ఇవ్వాళ్టి నుంచీను."

"సరే...ఆఫీసు వేళ కల్లా రా—"

ఒక గొంతు భర్తది. రెండో గొంతు ఆమెకు కొత్తదైనా, అందులో ఏదో విశేషం ఉన్నట్టుగా ఆమెకు తోచింది. ఆ రెండో

వ్యక్తి ఎవరో చూడాలని ఆమెకు కుతూహలం కలిగింది. సంభాషణ అయిపోబోయ్యే వేళకల్లా అమె గది గుమ్మం దగ్గరకు వచ్చి, గుమ్మానికి కట్టివున్న తెరను కొద్దిగా తొలగించి చూసింది. ముప్ఫై ఏళ్ళ పై వయస్సు వ్యక్తి అప్పుడే లేచి వెళ్ళబోతున్నాడు. మాసిన అతని బట్టలూ, చిక్కిన అతని శరీరమూ, బీదరికాన్ని చాటుతున్నయ్. మంగలి కత్తి కోసం ఎదురుచూసే అతని గడ్డం, అతనికి జీవితం మీద ఏర్పడ్డ నిర్లక్ష్యతను చెప్తోంది. లోతుగా ఎర్రపడ్డ అతని కళ్ళు, జీవితంలో అనుభవించిన బాధ క్రూరతగా మారి సూర్చ్ఛవటాన్ని చూపుతున్నయ్. ఆ కళ్ళలోని ఎరుపు లోకం మీద అతనికి కలిగిన కోపం లాగుంది. ఆ పెద్ద బొచ్చు టోపీకింద అతని తల భయంకరంగా వుంది. ఒక్క క్షణం కళ్యాణి చూపుల్తో అతని చూపులు కలుసుకున్నయ్. అసలు ఆ వ్యక్తిని చూడగానే కళ్యాణికి ఎందుకోగాని భయంవేసి, ఒక్క క్షణమైనా ఆ ప్రదేశంలో నిలబడలేక వెనక్కు వచ్చేసింది.

భర్త వచ్చి, "అబ్బాయి ఏడీ ?" అనే దాకా కళ్యాణి ఆ కొత్త వ్యక్తిని గూర్చిన ఆలోచనలోంచి బైట పడలేక పోయింది.

ప్రసాద్ ప్రశ్నకు జవాబుగా బైట కారు హారన్ మోగింది. కళ్యాణి నవ్వి "మూడు రోజుల్నుంచీ డ్రైవింగు నేర్చుకుంటున్నాడు-" అంది.

ప్రసాద్ నవ్వి, కారు దగ్గరికి వెళ్ళి, "ఏం చేస్తున్నావ్ వేణూ ?" అన్నాడు.

"కార్లో ఎక్కు నాన్నా ! షికారు కెళ్దాం"

"ఇందాకటి నుంచీ నువ్వు కార్లో తిరిగి వచ్చావుగా ? చాల్లే -" అని ఆ ఎనిమిదేళ్ళ కుర్రాణ్ణి చెయ్యి పట్టుకు నడిపించుకొని తీసుకు వెళ్ళాడు.

ఆ మధ్యాహ్నం ప్రసాద్ ఆఫీసుకు వెళ్ళబోతూ, "డ్రైవరు వచ్చాడు; నన్ను కోర్టులో దింపి కారు తీసుకు వస్తాడు. ఎక్కడి కైనా వెళ్ళి వస్తే వెళ్ళిరా-" అన్నాడు.

"నేనూ, అమ్మాను-" అన్నాడు కుర్రవాడు.

"ఊఁ. మీ ఇద్దరూను" అని వాడి బుగ్గ గిల్లి, ప్రసాద్ వెళ్ళి పొయ్యాడు.

మరో అరగంటకల్లా కారు తిరిగి వచ్చింది. దాసీది వచ్చి "అమ్మగారూ ! ఎక్కడికన్నా వెళ్తారా ?" అని అడిగింది.

కళ్యాణి విసుగ్గా "ఉఁహు" అని సమాధాన మిచ్చి దాసీ దాన్ని సాగనంపింది.

ఉదయాన ఆ కొత్త వ్యక్తి ముఖం చూసినప్పటి నుంచీ, కళ్యాణికి ఎందుకోగాని కష్టంగా వుంది. అంత పెద్ద బంగాళాలో కూర్చొని ఏం చెయ్యాలో కూడా, ఆమెకు తోచడం లేదు. ఏదో చదువుకో బోయింది; కాని ఆ చదివేది ఆమెకు అర్థమవనే లేదు. కిటికీ దగ్గర కుర్చీ వేసుకొని, బైటి తోటలోకి, దూరాన ఆకాశం భూమితో కలిసే ప్రదేశంలోకి, చూడటంతో ఒక గంట గడిపింది.

కుర్రాడు వచ్చి, తల్లి చీర కొంగు పట్టుకొని వేళ్ళాడుతూ, "అమ్మా ! కారెక్కి వెళ్దామే !" అని నసగ సాగాడు.

ఈ వూరు వచ్చిన నాలుగో రోజిది. ఈ నూతన వాతావరణం ఎలా వుంటుందో, ఇక్కడి ప్రజలు ఎలా బతుకుతుంటారో, ఇక్కడి గాలి ఎలా వుంటుందో, మొదలైన అనేక విషయాల్ని ఆమె ఇక్కడికి రాక పూర్వం ఆలోచించింది. కాని ఆమె ఊహ

కేమీ తట్ట లేదు. ఇప్పుడు ఏమీ తోచక పోవటంవల్ల, కారులో నాలుగు బజార్లూ తిరిగివస్తే, కాలం కొంత గడుస్తుంది గదాననే ఉద్దేశంతో, కుర్రాణ్ని ప్రోత్సహిస్తూన్నట్టు, "సరే...మరి బట్టలు వేసుకో" అంది. దాసీదాన్ని పిలిచి, "డ్రైవరు ఏం చేస్తున్నాడు ?" అంది.

"కారు షెడ్డులో కూర్చున్నాడమ్మా !"

"కారు సిద్ధం చెయ్యమను" అని మొహం కడుక్కొని, తన హోదాకు సరిపడే దుస్తుల్ని ధరించి, కుర్రాడితోపాటు పోర్టికో లోకి వచ్చింది. ఉదయాన ఆమె చూసిన వ్యక్తే దుస్తుల మార్పుతో డ్రైవరుగా నిలబడి, వెనుకసీటు తలుపు తెరిచాడు. అతన్ని చూడగానే ఆమెలో ఏదో బలహీనత్వం ప్రవేశించింది. కారణం ఆమెకే తెలియదు. తను అనవసరంగా ఇలా భయ పడటంలో, అర్థమేమీ లేదనుకొని, ఒకసారి అతని ముఖంలోకి ధైర్యంగా చూడటానికి ప్రయత్నించింది. కాని అతని కళ్లు ! ఆ చూపును, అందులోని ఆ అగాధాన్నీ ఆమె భరించలేక పోయింది. మళ్ళీ చూద్దామన్నా ఆమెకు ధైర్యం చాల లేదు.

కుర్రాడు తన చేతి పట్టును తనకు తెలియకుండానే వదిలించు కెళ్ళి కార్లో కూర్చొని, "రా అమ్మా !" అంటున్నాడు. ఆమె ఒక్కసారిగా నిద్ర నుంచి మేల్కొన్నట్టు కళ్లెత్తి చూసి, మెల్లిగా వెళ్ళి వాడి పక్కనే కూర్చుంది.

డ్రైవరు ముందుసీటులో కూర్చొనిఇంజను స్టార్టుచేసి, ముందు చూపుతోనే అడిగాడు : "ఎక్కడికి—అమ్మగారూ ?"

ఆమె వెంటనే సమాధానం చెప్పలేకపోయింది. అతని గొంతు కూడా ఆమె నిశ్చలపటుత్వంమీద దెబ్బ తియ్యగల దన్నట్టుంది!

కాస్త తడబడుతూ సమాధాన మిచ్చింది: "పోనీ...ఊళ్ళోకి... ఊరంతా తిప్పు!"

చివరిమాటకు కుర్రాడికి చాలా సంతోషంగా వుంది!

కారు బయలు దేరింది. అతివేగంగా వెళ్తూన్న కారులో— కుర్రాడు ఒక చివరకుజేరి, తల బైటికిపెట్టి చరచరా సాగి పొయ్యే దృశ్యాల్ని చూచి, ఆనందిస్తున్నాడు. కాని ఆమెను బైటి దృశ్యా లేమీ ఆకర్షించటం లేదు. గాలికి రెపరెపలాడే పైట కొంగును తీసి కంఠానికి చుట్టుకుంది. ముంగురులు తమ ఇష్టం వచ్చినట్టు ముఖంమీద ఆటలాడుకుంటూన్నా, ఆమెకు లక్ష్యమే లేదు. అసలు తను దేన్నిగూర్చి ఆలోచిస్తోందో కూడా ఆమెకే తెలియదు...

ఒక్కసారిగా ముందుకు చూసింది. ముందున్న అద్దంలో తన ప్రతిబింబాన్ని డ్రైవరు పరీక్షగా చూస్తూన్నట్టు ఆమెకు అనుమానం కలిగింది. పురుషులు అనేకమంది తనవైపు చూడటం ఆమెకు కొత్తకాదు. ఇదివరకుండే డ్రైవరు రోడ్డుమీదికి ఒక కన్నుంచి, రెండోకంటితో తనపాపను చూస్తూండటం కూడా ఆమె మరిచిపోలేదు. అప్పుడు ఆమెను బాధించని ఏచూపూ ఇప్పుడు యీ డ్రైవరు పాలపడి, తనకు కోపం కూడా తెప్పించింది.

కాస్త పెద్దగా, అధికార స్వరంతో, "స్పీడు తగ్గించు— తొందరేమీ లేదు" అంది.

వెంటనే కారువేగం తగ్గింది. కుర్రాడికి ఇది నిరుత్సాహంగా తోచి, ఏమీ అనలేక తల్లివైపు ఒకక్షణం బిక్కమొగంవేసి చూశాడు.

ఆమె మళ్ళీ, "బజారుకు...బట్టలకొట్టుకు పోనీ" అంది. కారు వెంటనే మలుపు తిరిగింది: అతను లోపల ఏమను కున్నాడో కాని, ఆమె మాటలుమాత్రం వెంటవెంటనే క్రియా రూపం తాలుస్తున్నవి. ఒక్కొక వ్యక్తికి ఎంత అధికారం వుంటుంది! మాటలు ఒక్కొకనోట ఒక్కొక అర్ధాన్ని కూడా ఇస్తుం టాయి కాబోలు !

బట్టలకొట్టు ముందు కారాగ గానే, ఆమె కుర్రాడితో కొట్లోకి వెళ్లి, అరగంట బేరమాడి, బట్టలన్నీ మూటగట్టించి, డబ్బు చెల్లించి బైటికి వచ్చింది. డ్రైవరు తలుపు తెరవగానే కార్లో కూర్చొని, అతనివైపు చూడకుండానే "లోపలమూట వుంది—" అంది అస్పష్టంగా.

అప్పటికే కొట్టువాడు బైటిదాకా మోసుకొచ్చిన మూటను అందు కొని కారులోపెట్టి, ఒకనిమిషంసేపు డ్రైవరు ఆమె ముఖంలోకి చూశాడు...ఎంతధైర్యం! ఆమె యీచూపును గమనించనట్టు నటించినా, ఏదో మనస్సులో ఆందోళనగానే వుంది.

డ్రైవరు తన సీటులోకి వెళ్ళగానే ఆమె అప్రయత్నంగా, 'ఇదిగో—నీపేరేమిటి?' అంది.

అతను వెనక్కు తిరిగి చూడకుండానే "శర్మ" అన్నాడు.

ఈమాటతో అతని గడ్డాన్ని పట్టి మహమ్మదీయుడా హిందువా అన్న ఆమె అనుమానం పూర్తిగా తేలిపోయింది. "శర్మ—శర్మ" అనుకుంది మనస్సులో. ఆపేరు ఎక్కడో విన్నట్టు గుర్తు. జ్ఞాపకం చేసుకోవాలని, ఆమెచాలా ప్రయత్నించింది కాని, ఆమెకు తగిన సహాయ మేమీ దొరికేట్టు కనుపించ లేదు.

దానితో యీ కారులో కూర్చొని తిరగాలనే కుతూహలం

కూడా ఆమెకు బాగా తగ్గిపోయింది. ఊరు చూడక ముందుండే ఆదుర్దా, చూస్తున్నప్పుడు లేకపోవటం సహజమే గదా !

‘‘ఇంటికి పోనీ—’’

ఇంటి గుమ్మంలో కారు రాగానే ఆమె దిగి, ఇంట్లోకి వెళ్ళ బోతూ, ఒకసారి వెనక్కు తిరిగి డ్రైవర్ను చూసింది. అతను పెదిమలు బిగబట్టి, పరుసుగా తనవైపే చూస్తున్నాడు. ఆమె విసుగుతో కోపంగా నేలను తన్ని, తనగదిలోకి వెళ్ళిపోయింది. అప్పటికి కాని ఆమె కేదో ఒత్తిడి తగ్గినట్టుగా తోచలేదు.

చాలా సేపటివరకూ యీ డ్రైవర్ను గూర్చి ఆలోచించింది. అతని ప్రవర్తన, ఆకారమూ, గడ్డమూ, కంఠమూ—అన్నీ ఏవో విచిత్రంగా కనిపించినయ్. అతని ముఖం, మరిచిపోతూన్న ఏదో విషయాన్ని జ్ఞాపకం చేసేందుకు ప్రయత్నిస్తూన్నట్టు, తోచింది.

అసలు యీ ఆలోచనతో బాధపడటం కూడా, ఆమెకు అనవసరంగా తోచింది. మనస్సును తనకు తానై క్షోభ పెట్టుకొని శాంతిని పాడు చేసుకుంటూన్న ట్టనిపించింది.

చప్పున కుర్రాడు జ్ఞాపకం వచ్చాడు; తనకు తోచనప్పుడల్లా కుర్రాడితో ఆడుకోవటం ఆమెకు అలవాటు. వాడికోసమని గదంతా కలయజూచింది; కానీవాడు లేడు. దూరాన్నించి వస్తున్న నవ్వులు విని, కిటికీలోంచి తోటకేసి చూచింది. అక్కడ డ్రైవరు వీపు మీదఎక్కి, వాడు ‘‘గుర్రంఆట’’ ఆడుకుంటున్నాడు. డ్రైవరు ముఖంలో తనకు కనిపించే క్రూరత యేదీ వాడికి కనిపించటం లేదు కాబోలు! కొత్తవాళ్ళ దగ్గరచప్పున అలవాటుపడని వీడు, డ్రైవరుతో ఇట్టే కలిసిపోవటం ఆమెకు ఆశ్చర్యంగానే వుంది. డ్రైవరు తన యీడునంతటినీ మరిచిపోయి, యీ చిన్నకుర్రా

డితో ఆడుకోవట మేమిటి ? తనూ ఆడుకుంటుంది, కాని—అది తనకు పుత్రుడి మీదవున్న ప్రేమ ! కాని ఇతర్లకు పరాయిబిడ్డల మీద ప్రేమేమిటి ? "జీవితంలో ఎప్పుడన్నా అతను ఇలాటి కొడుకును పోగొట్టు కున్నాడేమో ?" అనుకుందామె చివరకు సమాధానంగా.

వాళ్ళ ఆట చూస్తూ కూర్చుంది. కుర్రాడు నవ్వు ఆపుకోలేక నేలమీదపడి దొర్లుతున్నాడు. వాడు లేచేప్పటికి వాడిగుడ్డలన్నీ పాడయినయ్. అయినా వాడు దీన్ని లెక్క చెయ్యకుండానే డ్రైవరు గడ్డం పట్టుకొని, అతని తలను అటూ ఇటూ ఆడిస్తూ ఆనందిస్తున్నాడు.

జడ్జీగారి కొడుకు, సేవకుడైన డ్రైవరుతో ఆడుకోవట మేమిటి ?—ఒక్కసారిగా సమాజంలోని తన స్థానాన్ని ఆమె గుర్తించింది. ఈ సేవకునకు యీ విధంగా అలుసివ్వటం ఎంతైనా ప్రమాద మనుకొంది. దానికితోడు యీ వినోదాన్ని చూస్తూ నవ్వుతూన్న దాసీదిసైతం, ఆమె అభిమానాన్ని మేల్కొలిపింది. వెంటనే కుర్రాణ్ని కేకేసింది.

వాడు తలెత్తి చూసి "వస్తాలే—" అని తిరిగి తన ఆటలో జొరబడ బోతున్నాడు.

"సిన్నేరా... ఇట్లా రావేం ?" అంది మళ్ళీ.

"ఎందుకూ ?" అన్నాడు వాడు సూటిగా ఆమెవైపు చూస్తూ.

"రమ్మంటుంటే..." కల్పితకోపాన్ని కంఠంలో కనబరుస్తూ అన్నదామె.

"వస్తాలే...కాసేపుండి—"

డ్రైవరు లేచి నిలబడి, ఒకసారి ఆమెవైపు చూశాడు. మెఅ యీ చూపును తప్పించుకోవాలని ప్రయత్నించింది. అతను అన

లేమీ జరగనట్టే, కుర్రాణ్ని ఎత్తుకొచ్చి సావిట్లో దింపి, "అమ్మ గారు పిలుస్తున్నారు...వెళ్ళండి—" అని తను షెడ్డులోకి వెళ్ళిపోయాడు.

కుర్రాడు నిరుత్సాహంతో కోపాన్ని తెచ్చుకొని, చరచరా గది లోకివచ్చి, "ఎందుకమ్మా ?" అన్నాడు ముఖం చిట్లించుకొని.

ఆమె కోపంతో, "ఆ బట్టలన్నీ ఎందుకు పాడుచేసు కున్నావ్?" అన్నది.

"ఆడుకుంటున్నాను—"

"డ్రైవరుతో ఏం ఆట ?"

"అతను మంచివాడమ్మా !"

వాడికి కనిపించే మంచితనం తను కనుక్కోలేక పోయినం దుకు విచారిస్తూ, "సరే...ఆ గుడ్డలు విప్పి నీళ్ళు పోసుకురా—పో—" అంది గసురు కొంటున్నట్టు.

"కాసేపు ఆడుకొని..." అని, వాడు మెల్లగా తప్పించుకో వాలని ముందుకు రెండడుగులు వేశాడు.

కాని వెనుకనించి తల్లి కసురుకుంటూ, "నీకాదురా చెప్పేది ?—మళ్ళీ షికారు కెళ్లాం—" అంది.

ఈ చివరిమాటకు వాడు లొంగిపోయాడు. చప్పున తయార యేందుకని పరుగెత్తాడు. వాడు వెళ్ళగానే కళ్యాణి దాసీని పిలిచి, "డ్రైవరు ఏం చేస్తున్నాడు ?" అంది.

"ఇప్పుడే కారుతీసుకొని కోర్టుకు వెళ్ళాడమ్మా."

కల్యాణి మాట్లాడకుండా ఏదో ఆలోచిస్తూ అటూ ఇటూ చూడ సాగింది.

  

కుర్రాడు షికారు దుస్తులు వేసుకొని సిద్ధమై, "అమ్మా ! వెళ్దాం" అంటూ తల్లిని మారాం చెయ్యసాగాడు.

"కారు లేదు; నాన్నగార్ని తీసుకొచ్చేందుకు వెళ్ళింది... దాన్ని రానీ!" అని కళ్యాణి వాణ్ని ఎలాగో ఊరుకో బెట్టింది.

కారు రాక కోసం కిటికీలోంచి ఎదురు చూస్తూ, ఆ బుల్లి బుర్రతో వాడేదో ఆలోచించుకుంటున్నాడు. కళ్యాణికూడా ఇంకో దిక్కు చూస్తూనే, తన మామూలు సమస్యలోకి వెళ్ళి పోయింది. ఇతను కనిపించిన మొట్టమొదటి క్షణం నుంచీ, ఆమెకు అనేక ఇతర వస్తువుల మీది శ్రద్ధ తగ్గిపోయింది. అందుకు కారణం ఆమెకే తెలియదు.

ఆ సుబ్రాదు ఒక గంటలో డ్రైవరుతో స్నేహం సంపాయించ గలిగాడు. వాళ్ళిద్దరి ఆశయాలూ, యీడూ, వ్యక్తిత్వమూ— ఏదీ ఒకటి కాక పోయినా, ఒకే మెట్టుమీద ఇద్దరూ నద్దుకొని పిచ్చి ఆటలోని ఆనందాన్ని అనుభవించ గలిగారు. కాని యీ వ్యక్తిని చూసిన మొట్టమొదటి క్షణానే అతనిమీద గంపెడు అనుమానం తనకు ఎందుకు కలగాలి? లోకంలోని వ్యక్తుల్లో కొందరిని మొట్టమొదట చూడగానే పెద్ద అభిమానం కలుగు తుంది; మరి కొందరిమీద చెప్పరానంత అసహ్యభావం కలుగు తుంది. మొదటి వారు చేసిన మేలూ లేదు; ఈ రెండో వారు చేసిన కీడూ లేదు. మరి యీ కారణం లేని 'అభిప్రాయం' కలి గేందుకు ఏమన్నా 'కారణం' వుందా? ఆమె తనకున్న విజ్ఞా నంతో యీ విషయాన్ని తెలుసుకోలేక పోయింది. ఇంతకు పూర్వం అనేక మంది, ఇలాంటి అనుమానంతో బాధపడి, చివ రకు ఏ కారణాన్నీ కనుక్కోలేక విసిగి, వదులుకున్నారని ఆమెకు తెలియ తెలియదు!

కాని ఒకటి మాత్రం నిజం...ఈ డ్రైవరు మీద తనకు కలి గిన అభిప్రాయం తను బుద్ధిపూర్వకంగా తెచ్చుకున్నది మట్టుకు

కాదు. తనకు తెలియకుండానే, తన అనుజ్ఞ లేకుండానే అది తనంత తానుగా, తనలో ఒక స్థానాన్ని ఏర్పరచుకోగలిగింది. అందుకనే యీ అభిప్రాయాన్ని తను పోగొట్టుకునేందుకు ప్రయత్నించి, తప్పకుండా జయించవచ్చు ననుకొంటున్నది. ఇది పట్టి భ్రమ! కేవలం తన నీడను చూసి తనే భయపడటం లాటిదిది! పాపం-అతను తనకేమి హాని చేశాడు? ఎంతో గౌరవంగా 'అమ్మగారూ!' అని పిలుస్తున్నాడు. తమ సేవ చేసుకొని బతికే ఎంతోమంది సేవకుల మీద తనకు కలిగే దయను, అతను మాత్రం ఎందుకు దూరమవ్వాలి? చీదరికం, అసహ్యించుకునే వస్తువే అయితే-ముందుగా తన పుట్టింటి వారి మీద తనకు అంతులేని అసహ్యం కలిగి తీరాలి...

కారుమోత వినగానే, పుత్రుడు సంతోషంతో కేక వేసి నాట్యం చేయసాగాడు. ఈ చప్పుడుకు ఆమె ఆలోచనా సముద్రము లోంచి మేల్కొనేప్పటికే, ప్రసాద్ పుత్రుణ్ని ఎత్తుకొని తన ఎదుట నిలబడి ఉన్నాడు.

పుత్రుడు, "నాన్నా! షికారు వెళ్దాం...అమ్మా, నేనూ వెళ్తున్నాం. నువ్వుకూడా రా-" అని కారు తనదైనట్లూ, అందులోని కొంత భాగాన్ని తను యీ తండ్రికి బహూకరిస్తూన్నట్లూ, ఆహ్వానించాడు.

"షికారా?—ఏం కళ్యాణీ! అట్లా ఉన్నావేం?"

తనస్థితి ముఖంలో ప్రతిఫలించే టంతవరకూ వచ్చినందుకు ఆమె నొచ్చుకుంటూ, వెంటనే బలవంతాన ముఖకళను మార్చి నవ్వుతూ, "ఎల్లా వున్నాను?...ఇందాకే బజారు వెళ్ళి బట్టలు తెచ్చుకున్నాం" అని మాటలధోరణిని మరొక దిక్కుకు పట్టించింది.

"ఊఁ" అని తలవూపి, వంటవాడు సిద్ధంచేసిన టీ తాగూగు

ప్రసాద్ అన్నాడు: "డ్రైవరు చాలా యోగ్యుడులాగుంది. చాక చక్యంతో కారు నడపగలడు. అణకువ కూడావుంది కూడా"—

భర్తకూ, కొడుక్కూ కనిపించే ఆ యోగ్యత, తను కనుక్కో లేకుండా చేసిన ఆ బలహీనత్వ మేమిటో, ఆమెకు అర్థమవలేదు.

"మంచివాడు నాన్నా! చాలా మంచివాడు—అతని గడ్డం ఇంకా పెరుగుతుంది!" అన్నాడు కుర్రాడు.

కళ్యాణి బలవంతాన తన అభిప్రాయాన్ని వెంటనే మార్చుకొనే గట్టి ప్రయత్నపు మొట్టమొదటి మెట్టుగా, "అవును... చాలా మంచివాడు" అంది.

కుర్రాడు మాత్రం తన పాతపాటను వదలలేడు. "నాన్నా! షికారు!" అని మళ్ళీ ఎత్తుకున్నాడు.

ప్రసాద్ నవ్వి, "వా డంతగా అడుగుతూంటే షికారుకు వెళ్ళరాదూ!" అన్నాడు భార్యతో.

"ఏం షికారురా? కాసేపు ఆడుకోరాదూ?" అంది కళ్యాణి, కోపాన్ని నటిస్తూ.

కుర్రాడు నిరుత్సాహపడి తండ్రి సహాయం కోసం దీనంగా చూశాడు.

"వెళ్ళిరా—నడవాలా ఏమన్నానా? కాళ్ళకు మట్టి కాకుండానే తల్లీ కొడుకులు షికారుకు వెళ్ళి రాగలరుగా!"

భర్త మాటను ఆమె కాదనలేక పోయింది. కొంత చల్లగాలి తగులుతే తనలో అనవసరంగా రేగిన యీ తుపానుకు సంబంధించిన వేడి కూడా తగ్గవచ్చు. అదీ కాక తను ఒప్పుకోని కారణాన్ని చెప్పాల్సివస్తే, భర్తముందు అనవసరంగా బైటపడటం గూడా అవుతుంది. ఐనా "మీరు కూడా రండి.." అంది.

"నాకు చాలా పనివుంది...నువ్వూ, వాడూ వెళ్ళిరండి."

తను కాపరానికివచ్చిన మొట్టమొదటి రోజునుంచీ కూడా ఆమె కొక పెద్ద అనుమానం వుంది. గవర్నమెంటు వారు తన భర్త జీవితంలోని రోజుల్లో కొద్దిభాగాన్నే తమ పనులకోసం కొన్నారా, లేక అతని జీవితాన్నే కొన్నారా అనే సంశయం! ఎందుకంటే, ప్రసాద్‌కు ఎప్పుడూ ప్రత్యేకమైన గది ఒకటి వుంది. గదిలో చుట్టూవున్న బీరువాల్లో అన్నీ లా పుస్తకాలేను. మధ్య ఒక టేబిలు. కూర్చుని చదువు కునేందుకు ఒక రివాల్వింగ్ కుర్చీ, గదిలోనే ఒక పక్కన అతను పరుండే మంచమూ అమర్చబడ వుంటయ్. ప్రసాద్ ఇంటిదగ్గర ఉండే కాలంలోని అత్యధిక భాగాన్ని, ఆ గదిలోనే గడుపు తూంటాడు. రాత్రులు చాలా సేపటవరకూ మేలు కొంటాడు. ఒక రాత్రివేళ మెలకువ వస్తే, లేచి కూర్చొని మళ్ళీ లా పుస్తకాలు తిరిగేస్తూంటాడు. ఆ గది లోనే తన జీవితరహస్య మంతా దాచబడి నట్టూ, తన ఆశయ సిద్ధికై ఆ సమాధికన్న ఇంకోమార్గం లేదన్నట్టూ, అతను, ప్రవ ర్తించటం ఆమెకు కొత్త కాదు. అలాటి తన భర్తకు తీరుబడ వుంటుందని ఆమె ఎలా అనుకో గలదు?

"మేం వెళ్తాం" అంటున్నాడు కుర్రాడు.

మొదటి నుంచీ కూడా తనకు ఏ వస్తువైనా కావాలంటే, ఏ కోర్కె అయినా తీరాలంటే-తన మామూలు పాటను ఎక్కు వగా పాడి, యీ మెత్తని తలిదండ్రుల దగ్గర్నుంచి ఏ విధంగా పొందాలో కుర్రాడికి బాగా తెలుసు. అందుకనే ఇక విధిలేక, ఆమె "సరే...వస్తాను, ఉండు" అని లోనికి వెళ్ళింది.

అమె తిరిగి వచ్చేప్పటికి కుర్రాడు గదిలో లేడు. బైటికి రాగానే ఆశ్చర్య పడ్డది. కుర్రాడు డ్రైవరు భుజాలమీద ఎక్కి, హారన్ వాయిస్తూ, స్టీరింగు తిప్పుతున్నాడు.

ఆమె కోపంతో 'సరిగ్గా కూచోలేవూ ?' అంది. కాని వేణు తన స్థానాన్ని చూడమన్నట్టు, డ్రైవరు భుజాలమీద సవారీ చేస్తూ నవ్వుతున్నాడు.

"నీకే చెప్పేది !" అన్నది రవంత పెద్దగా.

ఆ 'నీకే' అనే మాటను ఆమె ఎవరి పరంగా ఉపయోగించిందో కాని, డ్రైవరు మాత్రం దానికి వెంటనే చలించి, కుర్రాణ్ని ఎత్తి, వెనుక సీటులో కూర్చోపెట్టాడు. ఆమె ఏమనేందుకూ సాహసించ లేక, పెదిమలు బిగ పట్టుకొని కుర్రాడి పక్కనే కూర్చుంది.

"ఎక్కడికి అమ్మగారూ ?"

"బీచికి-" విసురుగా సమాధానం చెప్పి, ఆమె పక్కకు చూడసాగింది. కారు బయలు దేరింది. ఆమె భరించలేనంత వేగంతో కారు పోతున్నా, ఆమె సహించింది. 'మెల్లగా తోల' మనాలంటే అతనితో మాట్లాడాల్సి వస్తుంది కనుకనే ఆమె అంతటి వేగాన్నీ భరించి ఊరుకుంది.

కారు సముద్ర తీరాన ఆగింది. కాని మనుషులు పోగై, రేడియో వింటూనో, పప్పులు తింటూనో—గాలి పీలుస్తూనో, ఆనందించే మామూలు స్థలం కాదది. ఊరికి బైటగావున్న సముద్రతీర ప్రదేశం. కారు ఆగగానే ఆమె ఉలిక్కిపడి, 'పోనీ-' అంది.

"ఇదే బీచ్ !"

ఈ మాట వినగానే కుర్రాడు సంతోషంతో సముద్రం ఒడ్డుకు పరుగెత్తుకు వెళ్ళి, ఒక్కడూ పిచ్చిక గూళ్ళను కట్టే సన్నాహంలో ఉన్నాడు.

ఆమెకు అతని సమాధాన మేమీ బాగుండ లేదు.

"ఇదా ? ఇక్కడ మనుషు లెవరూ లేరేం?"అన్నది కళ్యాణి.

"మనం మనుషులం కామా?"

అతని సమాధానానికి ఆమె నివ్వెర పోయింది. అతనన్న మాటకన్న అనేప్పుడు ధ్వనించిన కంఠస్వరం, ఆమెకు కఠోరంగా వినిపించింది.

"ఏమిటీ?" అంది, కొంత సేపయాక ఆశ్చర్యాన్ని తగ్గించుకుంటూ.

"మనం మనుషుల మేగా?"

తనను ఇంత తేలిగ్గా తీసుకునే ధైర్యం అతనిలో వుంటుందని, ఆమె కలనైనా ఊహించ లేదు. తనతోటా సరసం? అతనికి మతేమన్నా పోయిందా? కాక పిచ్చివాడా? తన దగ్గర నెల జీతానికి పడివున్న డ్రైవరు...తన మాటను ఆజ్ఞగా శిరసా వహించాల్సిన వాడు, తనతో ఇలాగా మాట్లాడటం?

ఆమె ఎంతో కోపాన్ని తెచ్చుకోవాలని ప్రయత్నిస్తోంది. కాని, ఆమె కోపంకన్న ముందుగానే అతని మాటలు బయట పడినయ్.

"నన్ను గుర్తు పట్టావా—కళ్యాణీ?"

ఆశ్చర్యంతో ఆమె వాక్కు మూగబోయింది.

"నేను...శర్మను; నా పెద్ద పేరును కత్తిరించి నువ్విచ్చిన చిన్న పేరుతోనే వ్యవహరించుకుంటూన్న నీ పాత స్నేహితుణ్ని. పన్నెండు సంవత్సరాల వెనుక...ఒక వ్యక్తిని—ఇంకా గుర్తు లేదా?" అన్నాడతను.

ఆమె కొన్ని నిమిషాల వరకూ శిలాప్రతిమలా అయిపోయింది. అతను పై విధంగా మాట్లాడేందుకు కారణం, ఆమెకు అర్థమవసాగింది. మెల్లిగా పన్నెండేళ్ల నాటి చరిత్రను జ్ఞాపకం చేసుకునేందుకు ప్రయత్నించింది. తాను...పన్నెండేళ్ల నాటి

మాట: ఆ స్నేహితం తనెల్లా మరిచి పో గలిగిందో కూడా ఇప్పుడు తనకు ఆశ్చర్యంగానే వుంది...శర్మవైపు ఒక్కసారి పరీక్షగా చూసింది—ఎంత మారి పొయ్యాడు! ఆనాడు—మర్నాడు తన వివాహమనగా, విశాల ప్రపంచంలోకి, ఎవరికీ తెలియకుండానే వెళ్ళిపోయి, యీనాడు, ఇంత మార్పుతో, ఇక్కడ తేలాడు! కాని మళ్ళీ తన జీవితంలో అతను ఎదురౌతాడని ఎన్నడూ ఊహించనైనా లేదు.

జీవితం చేత ఓడించబడి, నిరాశలకు క్రుంగికూడా, ఏవో చెప్పుకోలేని, కనీసం ఊహించుకోలేని ఆశలతో, లోకపు పత్తిడికి వాడిన అతని ముఖం, ఆరోగ్యంకూడా చెడినట్టు సాక్ష్యమిచ్చే అతని కళ్ళు, 'బతకటం దేనికి?' అన్నట్టు పదునుగా చూసే అతని చూపు!—ఎంత మార్పు?

ఇంత వరకూ యీ శర్మమీద ఆమెకు కలిగిన నిర్లక్ష్యభావమంతా ఎగిరి పోయింది. కారణంలేని ఆమె భయంకూడా పోయి, దాని స్థానంలో సకారణమైన కొత్త భయమొకటి మోసులెత్తింది.

ఒకనాడు అతను-తన జీవితపు టాశలన్నింటినీ, తన చేతిలో చిక్కించుకొని, తనకు అందని దూరాలకు వెళ్ళి పొయ్యాడు. తెనెలా బతకాలో అర్థం కాక, బాధపడిన నాలుగు సంవత్సరాలూ, ఎలా గడిచాయో కూడా ఇప్పుడు చెప్పలేదు... కాని అది తనకు కనిపించకుండా ఎక్కడో ఆ హృదయంలోనే రహస్యంగా దినదినాభివృద్ధయి—ఈ క్షణాన ప్రదర్శించిన ఆ భయంకర రూపమే ఆమె భయానికి కారణం.

ఆమెగుండె వడిగా కొట్టుకో సాగింది. ఉద్వేగంతో వినిపించు

తున్న ఆహోరు, సముద్రుడిదో, తన హృదయానిదో కూడా ఆమెకు తెలియటం లేదు.

"జ్ఞాపకం లేదా ?" అన్నాడు శర్మ మళ్ళీ.

ఆమె యీ లోకంలోకి దిగి, మెల్లిగా తలెత్తి అతని కేసి చూసింది. కాని, సమాధానం చెప్పే ధైర్యం ఆమె కింకా కలగ లేదు.

"ఎందుకు జ్ఞాపక ముంటుందీ ? ఒకనాడు నాపాదాల దగ్గర పడి, ప్రకృతి సిద్ధమైన ప్రేమభిక్షకోసం వేడుకున్న దానివి! ఇప్పుడు నేను నీపాదాల దగ్గరి సేవపట్టణ్ణయ్యాను...రోజులెంతపని చెయ్యా లేవు! ఈ అత్యున్నత స్థానానవున్న నీకు, అధఃపాతా ళాన వున్న నేను కనిపించను!"

నవ్వుతున్నాడు—నిర్లక్ష్యంగా. ఆ నవ్వు ఆమె శక్తు లన్నింటినీ కదిపింది. పన్నెండేళ్ళనాటి జ్ఞాపకాలన్నీ ఆమె కళ్ళల్లో మెరసి, మూల మూలలనుంచి, తను ఎనిమిదేళ్ళుగా ఎరగని కన్నీటిని కూడ దీస్తున్నాయి.

సముద్రంవైపు చూసింది—కుర్రాడు తయారు చేసిన పిచ్చిక గూటిని సముద్రపుటల మింగేసింది. వాడు అంతటితో ఆశ వదలక, కొంచెం ఇవతలికి వచ్చి, మళ్ళీ గూడుకట్టుకునే ప్రయత్నం చేస్తు న్నాడు. తన జీవితం కూడా అలాటి ప్రమాదమైన సముద్రపు టొడ్డునే వున్నదని పించింది. ఒకనాడు సౌఖ్యపడదామని ఆఒడ్డున మేడలు కట్టుకుంది కాని లోకమో, తన రాతో, ఆ మేడలను మింగి కూర్చుంది. ఆ సమయాన, ఆ విచారంలో గూడా తను పట్టు విడ వక, ఇంకో ప్రదేశానికి మారి, మళ్ళీ ఆశాసౌధల్ని నిర్మించు కుంది. ఇవి మొదటి సారికన్న జాగ్రత్తగానూ, అనుభవ పూర్వ కంగానూ కట్టుకున్నవనీ, వీటి కికచలనం వుండదనీ తను అపోహ

పడ్డది. కాని యీ క్షణానికి మళ్ళీ యీశర్మ ఒకపెద్ద అలగా తయారై ఏళ్ళ పర్యంతమూ స్థిరంగా వున్న తన సౌధాన్ని బెద రిస్తున్నాడు. ఎప్పటి కప్పుడు నిర్మించుకునే ఆశతో తను వాటి భద్రతకు గాను జాగ్రత్త పడాలి.

కుర్రాడికి విసుగుపుట్టి, తల్లిదగ్గరికి పరుగెత్తు కొచ్చాడు. ఇప్పటికీ ఆమె కంటినుంచి నీరు కారుతోంది. కుర్రాడి రాకను ఆమె చూసినట్టయితే, తన బాధను వాడికి తెలియకుండా చేసుకు నేది.

వాడు ఇసుక చేతుల్ని దులుపుకుంటూ, 'అమ్మా! ఏడుస్తా వెందుకూ?' అని అడిగాడు. ఇంతవరకూ తల్లి ఏడవటాన్ని వాడు చూడలేదు. ఏడుపనేది చిన్నతనంలో తనలాటి కుర్రాళ్ళ కుండాల్సిన లక్షణమనీ, పెద్దవాళ్ళు ఎన్నడూ ఏడవనే ఏడవరనీ వాడి అభిప్రాయం.

ఆమె చప్పున తేరుకొని, కన్నీళ్ళు తుడుచుకుంది. తల్లి సమా ధాన మివ్వక పోవటం చూసి, కుర్రాడు సాలోచనగా డ్రైవరు మొహం తప్పించి, సముద్రుడు ఆకాశంతో స్నేహం సంపాయిం చుకో గలుగుతూన్న సుదూర ప్రదేశం వైపు చూస్తున్నాడు.

"ఏమమ్మా?" అన్నాడు కుర్రాడు మళ్ళీ.

దుఃఖంతో పూడుకుపోయిన గొంతును సరిచేసుకుంటూ: "ఏం లేదు నాయనా! కంట్లో ఇసుక పడ్డది—ఇక వెళ్దామా?" అంది కళ్యాణి.

కుర్రాడు యీ మాటను నమ్మాడు. తల్లికేదో కష్టంగా వుందని చప్పున కారెక్కి కూర్చొని 'పోనీ' అన్నాడు డ్రైవ రుతో. కళ్యాణి కారులో కూర్చుంది. కుర్రాణ్ణి తన ఒడిలోకి తీసు కొని, వాడి తలమీద తన గడ్డాన్ని అనించి, నిశ్శబ్దంగాఎవర్నో,

దేనికో ప్రార్థిస్తోంది. కారు ఇంటికి వచ్చేటంత వరకూ శర్మ ఏమీ మాట్లాడ లేదు. కాని, ఆమె బాధపడటమంతా ముందున్న అద్దంలో చూస్తూ అతను అర్థం చేసుకుంటూనే వున్నాడు.

ఆరోజు బాగా చీకటి పడేవరకూ భర్త ఎదుట పడకుండా కళ్యాణి ఎలాగో తప్పించుకు తిరగ గలిగింది.



ఆ రాత్రి ఆమె పడుకుందన్న మాటే కాని, ఆ పక్కలో మెత్త దనమే లేదు. ముళ్ళ మీద పడుకున్నట్టని పించిం దామెకు. చాలా సేపటి వరకూ అటూ ఇటూ దొర్లి, తరువాత పక్కలో లేచి కూర్చొని, తరగని ఆలోచనల్లో పడ్డది.

శర్మ! ఒకనాటి తన ప్రియుడు శర్మ! లోకమూ, విధీ అనుకూలంగా ఉన్నట్టయితే, తను యీ డ్రైవరు భార్యకావా ల్సింది! ఆశర్మ మళ్ళీ తనకు ఎదురయ్యాడు. విధి ఎంత కఠినమైంది! అసలు అతను తనకు జీవితంలో కనిపించక పోయి నట్టయితే—మృత్యువాత పడి వున్నట్టయినా, తనకీ బాధ తప్పేది! కనిపించిన వాడు కనీసం తనను తాను ఎరుక పర చుకో కుండావున్నా సరిపొయ్యేది. కాని అతను సరిగ్గా తనే విషయమై బాధ పడగలడో—ఆ విషయాన్నే అమిత గురితో కొట్టాడు.

పన్నెండేళ్ళలో శర్మ ఎంత మారిపొయ్యాడు! ఏరోజు కా రోజు తనకు తెలియ కుండానే తను కూడా పూర్తిగా మారి పోయిందేమో? ఈనాడు అతనిపై తను ఎంత అధికారాన్ని చలా యించింది! ఏమనుకున్నాడో? బాధ పడ్డాడు కాబోలు!

ఇంకా బాధ పడుతూనే ఉన్నాడేమో? తన హృదయంలో తన ఎరుక లేకుండానే ఎంత కరుకుదనం అణిగి వుంది!

ఆరోజులు—సంవత్సరాల వెనకటి రోజులు అవి—తన జీవితంలో మధురతమ దినాలని భ్రమపడ్డ రోజులు! ఆ వెన్నెల రాత్రులు—నిద్రాముద్రిత లోకాన్నంతట్నీ మోసం చెయ్యగలిగాననే ధీమాతో, అనధికారంగానైనా సౌఖ్యాన్ని అనుభవించ గలుగుతున్నాననే తృప్తితో—పరిణామమేమో ఆలోచించేందుకైనా వ్యవధిలేని సంతోషం నిండిన హృదయంతో గడిపిన కమ్మటి రాత్రులు! బిదరికానికీ, సౌఖ్యానికీ లంకె లేదనే న్యాయాన్ని గ్రహించిన రోజులు—వాటిని ఎలా మరిచి పోగలిగింది తను?

'శర్మ మంచివాడు' అనీ, 'శర్మ అందమైన వాడు' అనీ, 'శర్మ బాగా పాడగలడు' అనీ ఇరుగు పొరుగు అమ్మలక్కలు అనుకుంటూంటే, తను విని ఆనంద షడ్డరోజు లవి! శర్మ మినహాగా లోకమే లేదని అభిప్రాయపడ్డ దినాలవి! అప్పుడు అంత ప్రేమ పాత్రుడైన శర్మ, యీనాడు తన కన్నెర్రకు ఎలా గురి కాగలిగాడు? నిజంగా అతన్ని తను ప్రేమించిందా? ప్రేమించ గలిగిందా? ప్రేమించక పోయినట్లయితే—ఒకనాడు కాదు, రెన్నాళ్ళుకాదు—నాలుగు వసంతాలపాటు అహోరాత్రాలూ తన ఆశలన్నీ ఇంకిపోయినట్టు ఎలా బాధపడ్డది! జీవితం చాలా వింత వస్తువు! అతను మాయమై నప్పటినుంచీ, తను కాపరానికి వచ్చిన ఆర్నెల్లలోనూ, తన స్నేహితురాండ్రు, తన మూలానే శర్మ పిచ్చివాడై దేశాల పాలయ్యాడని అనటాన్ని అనేకసార్లు తను విన్నది. ఒక ప్రాణి జీవితాన్ని—తన హృదయాన్ని అర్పించుకున్న మానవుడి బతుకును; పాడుచేసిన తన

రాక్షసత్వాన్ని గూర్చి ఆమె ఆడిపోసుకుంది. శర్మ అభివృద్ధికై వేయిదేవుళ్ళకు మొక్కుకున్న రోజులుఅనేకంవున్నయ్.

అలాటి జీవితాన్ని, కాలచక్రం తనకు తెలియ కుండానే మెల్లిగా వెనక్కు నెట్టేసి, తనకు బదులు ఆనందాన్నిచ్చి మనశ్శాంతిని ప్రసాదించింది. కాని ఒకప్పటి ఆ మధుర సంవేదనలు, తీయని జ్ఞాపకాలు, స్మృతి పథంలోకి రాకుండా ఎంత తొక్కి పెడదామన్నా ఆమెకు సాధ్యమవటం లేదు. అనుకోకుండా జరిగే అనేక కార్యాలు అనుకుంటే జరుగవు కాబోలు !

ఈ ఆగని ఆలోచనలు ఆమె మనశ్శాంతిని క్షుభిత పరిచాయి. బాధతో కన్నీరు కార్చడమనేది, ఆమెకు ఎనిమిది సంవత్సరాలనుండీ తెలియదు. మళ్ళీ అది యీనాడు — సంభవించింది. తనెందుకు బాధ పడటం ? ఎవరికోసం ? ఇన్ని వసంతాల వెనుకటి జీవితాన్ని తను మరిచిపోతే ఎంత బాగుండును ! కానీ అది సాధ్యమా ?

గడియారం పన్నెండు గంటలు కొట్టింది. కళ్యాణి ఉలికి పడ్డది. ఇలా ఆలోచించటం అనవసరమనీ ఇందువల్ల తను బాధను కొని తెచ్చు కోవటమే అవుతుందనీ తలపోసింది. ఎలెక్ట్రిక్ లైటుఆర్పి గట్టిగా కళ్ళుమూసుకొని పడుకుంది. కాని ఆస్థితి మరింత దుర్భరంకాగా వెంటనే కన్ను తెరిచింది. గది నంతట్నీ ఆక్రమించున్న చీకటికి ఆమె భయ పడ్డది. ఎవరో తనను కనపడని తావుల్నుంచి ఒత్తిడి చేస్తూన్నట్టనిపించింది. ఆ సంక్షోభాన్ని భరించలేక, వెంటనే మళ్ళీ లైటు వేసింది.

ఇక తను నిద్రను నోచుకోలేదు. జీవితంలో అనేక కష్టాలకు గురై, అన్ని ఆశల్నీ వదలుకొని, బ్రతుకుమీద రోతపుట్టి,

మృత్యుదేవత ప్రసాదించే శాంతిని మాత్రమే మానవుడు కోర కుండా...ఈ చిన్ననిద్రలో ఆ బాధల్ని కొంతవరకూ మరిచి పోగలిగేట్టు చేస్తే, తెల్లారగానే మళ్ళీ తనతోడి ఆటకు కొత్తగా తయారౌ తాడని విధి ఏర్పరిచిన కీలకమే యీ నిద్ర! కాని 'శర్మనుగూర్చి ఆలోచించేందుకూ, నిద్రకూ పొత్తు పొసగదు అదీగాక—యీశర్మ కళ్ళ ఎదుట తారట్లాడు తూంటే అతన్ని గూర్చి ఆలోచించ కుండా ఉండటం ఎలా సాధ్యం? సాధ్యం కాని మాట నిజమేగానీ, మరి తన కర్తవ్య మేమిటి?

ఈ శర్మను ఇక్కణ్నుంచి వెళ్ళ గొడితే? పాపం-తిండికై తమ పంచన జేరినవాణ్ని ఇంకో చోటు చూచుకో మనటం ధర్మమా? ఐనా అతనిలాటి వాళ్ళు లోకంలో చాలా మంది ఉన్నారు. ఎంతమంది మీద తను దయను చూపగలదు? అయితే ఒకటి మాత్రం నిజం! అతను యీ పరిసరాల్లో లేక పోతే, ఎప్పటివలెనే తన మనశ్శాంతి మళ్ళీ తనకు దక్కు తుంది. అతను వెళ్ళకుండా తనకు శాంతి లభించేందుకు ఇంకే ఉపాయమూ కూడా లేదాయె. నిజమే! మరి అతన్ని ఏ తప్పుమీద, ఏ వంకమీద, వెళ్లగొట్ట గలదు? ఈ సాయింత్రమే అతన్ని గూర్చి మంచి అభిప్రాయాన్ని భర్త ముందు బైట పెట్టింది. తండ్రీ కొడుకులకు కూడా అతనిపైని అభిమానం ఏర్పడ్డది. ఐనప్పుడు ఇంకే కారణాన్ని తను చూపాలి?

''ఇంకా నిద్ర పోలేదా?''

ఆమె ఉలిక్కిపడ్డది. భర్తవైపు తిరుగుతే వెల వెల పోతూండే తన ముఖాన్ని అతను గుర్తిస్తాడేమో ననే భయంతో, వేరొక దిక్కు చూస్తూ ''లేదు...తల నొప్పిగా వుంది-మీరో?'' అన్నది.

''నేను రాసుకుంటున్నాను...మందేమీ వాడలేదా?''

"వాడాను—తగ్గుతోంది. కాస్త ఆగి పడుకుంటాను"

భర్త తిరిగిపోతూన్న అడుగుల చప్పుడు వినేదాకా, వెనక్కి తిరిగి చూసే ధైర్యం ఆమెకు కలగలేదు. పక్కనే మంచమ్మీద కుర్రాడు, తన కీ లోకంతో, యీ సమయంలో ఏమీ పట్టనట్టు, హాయిగా నిద్రపోతున్నాడు. తనను 'ఎందు కేడుస్తున్నావమ్మా?' అని అడిగిన ఏకైక ప్రాణి! జీవితంలో పెద్ద పెద్ద ఏడ్పుల సమయాలున్నాయని వాడికింకా తెలియదు. తన తల్లి అందమైన పెద్ద కళ్ళు, తన ఆటల్ని చూసి ఆనందించేందుకనే భ్రమ పడుతున్నాడు కాని, హృదయారాటాన్ని వెలిబుచ్చుకునే కన్నీటికని వాడు ఎరగడు. ఎంత అమాయకుడు!

తనకు కావాల్సింది సాధించేందుకు, కాస్సేపు తల్లి దండ్రుల దగ్గిర రాగాలాపన చేస్తే వాడి కోరిక తీరుతుంది. కాని తను, తన లాటి నిర్భాగ్యమానవులు – ఆ విధి ముందు బ్రదుకంతా ఏడుస్తూ కూర్చున్నా, జీవితంలో కావాల్సింది రాదనే సంగతి వాడసలు ఊహించనే లేదు...

...ఇప్పటికి దాదాపు తెల్లవారు జామయింది. కుర్రాణ్ని తన పక్క మీదికి లాక్కొని, నీటిలో పడ్డ వ్యక్తి చేతికి దొరికిన కఱ్ఱను వదలనట్టు, వాడిమీద చెయ్యివేసుకొని, లైటు తీసే ధైర్యం లేక అలాగే పడుకుంది. ఎప్పుడు నిద్ర పట్టిందో కాని, తెల్లారి కుర్రాడు లేచి 'లైటు వెలుగుతోందమ్మా' అనేదాకా ఆమెకు తెలివి రాలేదు.



తనెవరో కళ్యాణికి తెలియపరుచుకున్న క్షణం నుంచీ, శరత్ కూడా అనేక కొత్త సమస్యల్ని ఎదుర్కొన్నాడు. ఆమె కన్న

అతను తక్కువగా మనశ్శాంతిని పోగొట్టుకున్నా డనేందు కూడా వీల్లేదు.

కళ్యాణి! ఈ మధురమూర్తిని భార్యగా చేసుకొని, జీవిత మంతా సౌఖ్య పడదామని కలలు కన్నాడు. విధితో పోరాడాడు. ఆ పోరాటంలో పరాజితుడయ్యాడు. ఆ ఓటమితో, తను దారం తెగిన గాలిపటం లాగా లోకపు టాకాశంలో, ఒక మూలనుంచి ఇంకో మూలకు తరుమ బడుతున్నాడు. ఈ స్త్రీ కోసం తనను లోకులు సైతం కనిపెట్టలేని పిచ్చివా డయ్యాడు.—ఆ మధుర మూర్తి, ఆ కళ్యాణి, యీనాడు తనకు యజమానురాలు ! పూర్వం తను ఆరాధించింది యీ కళ్యాణినే! కాని, ఆమె హృదయంలో స్థానాన్ని ఏర్పరచు కొని, ఇద్దరిమధ్యా భేదం లేదనే గాఢ నమ్మకంతో పూజించిన స్త్రీ ఆనాడామె! ఈనాడు విలువైన దుస్తు లున్నంత మాత్రాన, తనను పోషిస్తూన్న వంకమీద, తన సేవను తనకు ఇష్టం లేకున్నా దబాయించి కొనుక్కోగల మనిషిగా ఆ కళ్యాణినే ఆరాధించ వలసి వచ్చింది. తనతోడి స్నేహాన్ని ఆశించి, అందుకు ఇంత విశాల ప్రపం చంలోనూ తనొక్కడే అర్హు డయినట్టు, భావించి, తన వ్యక్తిత్వ మొక్కటే తను కోరే జీవితపు కోర్కె అయినట్టు ప్రవర్తించిన ఆ ఆడుదాని దగ్గరే ఇప్పుడు తను సేవకుడు. విధి ఇంతకన్న కఠిన రూపాన తనకు కనపడ దేమో!

కళ్యాణికీ, తనకూ మధ్య వున్న ప్రతి చిన్న భేదమూ, అతన్ని బాధించ సాగింది. ఆమె గౌరవమూ, ఆమె హాయిగా బతకటమూ, ఆమె ఐశ్వర్యమూ, చివరికి ఆమె స్త్రీత్వమూ కూడా, అతనికి భరించరాని దైంది. దీని ఫలితంగా ఆమెమీది ప్రేమంతా వెం టనే రంగు మార్చుకొని, ఈర్ష్యరూపాన తయారైంది. తనకే

పరిస్థితులు అనుకూలించి నట్టయితే—కనీసం యీ ఒక్క కళ్యాణి, తనమాటను తోసివేసి ఉండక పోయినట్టయితే—ఆమె ఈ సరికి తనభార్యఅయి, తనతోడి అదృష్టాన్నీ, దురదృష్టాన్నీ పంచుకొని, తన రాకకోసం ఎదురు చూస్తూ, తన అడుగులకు మడుగులొత్తుతూ, చచ్చినట్టు పడివుండాల్సింది! ఆ కుర్రాడితో తనకు యీనాడు కలిగిన ఆ ఆనందమంతా, తన స్వపుత్రుడిమీద కలిగి వుండాల్సింది! ఈ కళ్యాణి తనకు మాయమైనట్లే కని పించి, యీనాడు అందని కొమ్మన కూర్చొని తన మొహంలోకి నవ్వినట్టని పించింది.

రాత్రంతా ఆమె గదివైపే చూస్తూ కూర్చున్నాడు. ఆమె గట్టిగోడలవెనుక పడే బాధను అతను ఊహించ లేక పోయాడు. ఆమె ఎందుకు బాధ పడుతుంది? 'బాధ' అనే దానికి కూడా తనకు నివాస యోగ్యమైన స్థానాలు తెలుసు. ఆ కప్పుకింద తన జీవితాన్నే స్వర్గంగా మార్చుకుంటూ ఆమె బతుకు తోంది. తన సంగతే ఆమె తలిచి ఉండదు. ఆ అవసరం మాత్రం ఆమెలాటి ఉత్తమవంశ సంజాతకు ఎలా వుంటుంది? తన జీవితాన్ని నేల పాలు చేసిందీ కళ్యాణి! ఇన్నాళ్ళుగా తను గ్రహించ లేని దేదో అతనికి కళ్యాణిలో యీ రోజున స్పష్టంగా కనిపిస్తోంది. కాని తను మానవుడై—ఏమీ చేతకాని దద్దమ్మలాగు ఉండగలడా? ఆమెను—తన అందానికీ, తన సౌఖ్యానికీ, గర్వ పడుతూన్న ఆమెను—తనతో పాటే కిందికిలాగి బాధించాలి! అంత వరకూ తనకు మనశ్శాంతి ఉండటం కల్ల! ఆమె సౌఖ్యంకోసం ఒక నాడు తను చేసిన, చెయ్యగలిగిన, త్యాగం; తన కెంత నష్ట మయిందో, ఆమెకు ఎంత లాభ మయిందో కూడా ఆమె తలచ లేని స్థితికి ఈనాడు ఆమె వచ్చింది—.

ఆ రాత్రంతా మేలుకొని శర్మ ఆలోచించిన దానికి ఫలితం—బుసలు కొడుతూకళ్యాణివెంట పడి, తనుఅనవసరంగా, ఇన్నాళ్లూ పడిన బాధలకు ప్రతిఫలంగా, ఆమెను తన అదుపాజ్ఞల్లోకి లాక్కో-వాలనే నిశ్చయంగా తయారైంది.

మర్నాడు మధ్యాహ్నం—

కళ్యాణి ఎందుకో గాని కిటికీలోంచి ఒకసారి కారుషెడ్డు వైపు చూసింది. శర్మ దాసీదాని పైట పట్టుకొని లాగు తున్నాడు. అది నవ్వుతూ, ససుగుతూ, వేళాకోళ మాడుతోంది. తరువాత ఇద్దరూ కారుషెడ్డులోకి మాయ మయ్యారు.

ఆమెకు ఒళ్ళు మండింది. శర్మ ఎంత చౌరబారు మనిషిగా తయారయ్యాడు! ఎంత నీచుడుగా మారిపోయాడు! లోకంలో ఏకాకై బతుకుతూ కూడా, లోకాన్ని చూసి భయపడక పోవడ మేమిటి? తన శర్మ, అంతకన్న గొప్ప పురుషుడు తనకీ భూమి మీదనే దొరక డనుకున్న శర్మ—ఇలా మారుతాడని తను కల నైనా తలచగలదా?

—కాని తనకు అతనిమీద యీ ఉన్నాస కోప మెందుకు రావాలి? లోకంలో అనేకమంది ఇతర్ల కళ్ళఎదుట—కనీసం ఇతర్లకు తెలిసేట్టయినా చేసే నీచకార్యాల్ని గూర్చి, ఆలోచించే వాళ్ళయినా లేరే! మానవుడు చేసే పనినే ఈ శర్మచేస్తే తన కెందుకు యీ బాధాకరమైన ఆలోచన రావాలి? శర్మ ఎవరో, తనెవరో—అతనిమీద తన కెందుకు ఈ యీర్ష్యతో కూడుకున్న జాలి? ఆమెకు, ఎంత ఆలోచించినా యీ ప్రశ్నకు సమాధా నమే తెలియ లేదు.

ఏది ఎట్లావున్నా శర్మను వెళ్ళగొట్టటం చాలా ఉత్తమ మైన పని. అందుకు యీ దాసీదాన్ని అడ్డంపెట్టి పన్నాగం పన్నితే

చాలు. కాని శర్మ తనపట్ల కనబరిచిన నీచతనే, తను ఇతర్ల కు చూపటానికి ఆమెకు ఎందుకో గాని మనస్సు ఒప్ప లేదు. శర్మను డ్రైవరు రూపాన జీతానికి కుదుర్చు కున్నారు కాని, ఆ మిగిలిన అతనిలోని మనిషితో తనకు సంబంధం అనవసరమే! అదీ కాక, శర్మ ఇంట్లో అందరి అభిమానాన్నీ సంపాయించ గలిగాడు. తను కిందటి సాయింత్రమే శర్మను మంచివాడుగా భర్తయెదుట పేర్కొంది. ఈనాడు మళ్ళీ తన సిద్ధాంతానికి విరుద్ధంగా మాట్లాడటం తప్పు తను పిచ్చిదాన్నిగా చేసుకోవటమే! భర్త తనను ఒక్కసారిగా నమ్మలేడేమో కూడా! కుర్రాడు మామూలుగా తన ఆటల్ని డ్రైవరుతో సాగిస్తూన్నా, శర్మకు భయపడి ఆమె వాణ్ణి పిలవటం కూడా మానుకుంది.

పోనీ, తనే కొన్నాళ్ళపాటు యీ ప్రదేశం వదిలిపెడితే? వదలి ఎక్కడికి వెళ్ళేటట్టు? ఈవూరు వచ్చేముందే రెండు నెలల పాటు పుట్టింట్లో గడిపి వచ్చి, మళ్ళీ ఇప్పుడే అక్కడికి వెళ్తానంటే అర్థ ముండదు. అసలు ఇంత సౌఖ్యానికి అలవాటు పడ్డ తన ప్రాణికి ఆ బీదకొంపలో హాయికూడా లేనిమాట నిజం.

ఆ సాయింత్రం—

భర్త బలవంతంమీద, అతనితో పాటే షికారుకు వెళ్ళింది. కారు కిందటిసాయింత్రం ఆగిన ప్రదేశంలోనే ఆగింది. ఆ ప్రదేశాన్ని చూసేటప్పటికే, ఆమెకు గతించిన బాధాకరమైన ఆలోచనలన్నీ, ఒక్కసారి జ్ఞాపక మొచ్చినట్టయింది. అప్రయత్నంగా ఆమె లోలోన వణకసాగింది.

ఆమెకు శర్మవైపు చూసే ధైర్యంకూడా లేదు. భర్త చెయ్యి పట్టుకొని తన నెవరో లాక్కుపోతారన్నట్టు, ఎంత సేపటికీ అతని దృష్టిలోనే సంచరించేందుకు ప్రయత్నించింది. కుర్రాడు కష్టే

పిచ్చికగూళ్ళు అందాన్ని, భర్తలాగా తను గ్రహించలేక పోయింది. ఆమెలో పనిచేసే ప్రశ్న ఒక్కటే: 'శర్మనుగూర్చి తనేమి చెయ్యాలి?'

ముగ్గురూ మళ్ళీ తిరిగి వచ్చేప్పటికి శర్మ స్టీరింగుమీద తలవాల్చి నిద్రపోతున్నాడు. మూసివున్న అతని కళ్ళనుంచి రెండు మూడు నీటిబిందువులు కిందపడేందుకు సిద్ధంగా ఉన్నయ్.

ప్రసాద్ ఇది చూసి, భార్యనూ కొడుకున్నూ అవతలికి తీసుకు వెళ్ళి, "అతను లేచేదాకా, కాస్సేపు కూర్చుందాం" అన్నాడు. కుర్రాడు మళ్ళీ తన ఆట ప్రారంభించాడు.

ప్రసాద్ ఒకసారి జాలిగా కారువైపు చూసి, "నిర్భాగ్యుడు! ఒకప్పుడు బాగా బతికినట్టున్నాడు. ఏనాటి ప్రియురాలినో తలచుకొని ఏడుస్తున్నట్టుంది" అన్నాడు.

కళ్యాణి యీ మాటకు తనకు తెలియకుండానే కంపించింది. భర్తకుకూడా తన రహస్యమేమిటో తెలిసిపోయిందనే కొత్త భయమొకటి ఆమెకు కలిగింది. వెంటనే ప్రసంగం మార్చేటందుకు 'చదువులేక కుర్రాడు చెడిపోతున్నాడు' అంది.

"ఔను...నేనూ అదే ఆలోచిస్తున్నాను. త్వరలోనే ప్రైవేటు మాస్టర్ని కుదర్చాలి."

ఆవిధంగానన్నా కుర్రాడు, శర్మబారినుంచి బైటపడతాడని ఆమెకొక తృప్తి! నీలాకాశం, అంతులేని సముద్రపు నీటిలో తన పాపను చూసుకుంటూన్న దృశ్యంగూడా, ఆమెకు ఆనందం ఇవ్వలేదు.

పసిపట్టి అతిప్రయాసకు ఓర్చి, చాలా దూరంనుంచి తరు

ముకు వచ్చి, తన ఆహారంకోసం ఆత్రుతపడుతూ, కాచుకు కూర్చున్న వన్యమృగంలాగు—శర్మ కళ్యాణితో మాట్లాడే సందర్భంకోసం ఎదురు చూడసాగాడు. ఆమె ఇదివరకు లాగు బైట కనిపించటం మానేసింది. రోజులో హఠాత్తుగా ఎప్పుడో రెండు మూడుసారులు, మెరుపు మెరసినట్టు కనిపించీ కనిపించ కుండానే మాయమయ్యేది. కుఱ్ఱాడుమాత్రం ఆటలకు విడువ కుండా వస్తున్నాడు. తన కసలు ఆ ఆటలమీది ఉత్సాహం క్షీణించినా, కుఱ్ఱాడి ద్వారా కొంత ఇంటిగుట్టు తెలుస్తుందనే అభిప్రాయంతో శర్మ లేనిపోని ఉత్సాహాన్ని నటించ సాగాడు.

మధ్యమధ్య "అమ్మగారు కోప్పడతారు" అనేవాడు—ఆ "అమ్మగారు" తన కెంత ముఖ్యమో తెలియ జేస్తున్నట్టు.

"ఫర్వాలేదు."

"అమ్మగారు ఏం చేస్తున్నారు ?"

"చదువుకుంటోంది" అనో, "పడుకుంది" అనో సమాధానం వచ్చేది. ఇంతకన్న విడమర్చి యీ కుఱ్ఱాడిద్వారా తెలుసుకో వాల్సిందికూడా శర్మకు కనిపించ లేదు.

పోతే, దాసీదానిద్వారా తనకు అందే వార్త—"కూర్చు న్నారు ; ఏదో ఆలోచిస్తున్నట్టున్నారు" అని. ఆ ఆలోచన దేన్ని గూర్చో తెలుసుకోవాలని శర్మకు కుతూహలం వుంది; కాని, గట్టి శరీరం వొకటి అడ్డమవటంవల్ల అది సామాన్య మానవుడైన శర్మకు అతీతమైంది.

దాసీదాని దగ్గర్నుంచికూడా, తన గుట్టు బైటపడకుండా, ఇంతకన్న విశేషాలు లాగటం శర్మకు సాధ్యపడటం లేదు. రాత్రిళ్లుమాత్రం ఆమె గదివైపే చూస్తూ కూర్చునేవాడు. బాగా పొద్దుపొయ్యేవరకూ, గదిలో లైటు వెలుగుతూనే వుండేది. లోపల

జరిగే నాటకాన్ని అతను తన ఊహకు తోచినట్టుగా ఆలోచిస్తూం డేవాడు. ఆ గట్టిగోడల వెనుక, ఆ లైటే, తనకు అందరాని వస్తువయినట్లు, దానితోపాటే తనూ మేలుకోడం నేర్చుకున్నాడు. పిచ్చిశర్మకు గదిలోంచి నవ్వు వినిపిస్తూన్నట్టనిపించేది. ఆమె ఆనందిస్తోందన్న తలపు వచ్చినప్పుడల్లా, అతనిగుండె మండి పడేది. వెంటనే, తన జీవితంలో ముప్పయినాలుగు వసంతాలు గడచిపోయిన సంగతి, ఇప్పుడే తెలుసుకున్నట్టుండేది. తనకు ఏమంచి అనుభవమూ లేకుండానే, జీవితం పూర్తికాబోతోంది కాబోలు! ఇప్పటి కైనా, తను మేలుకోకపోతే...ఇక లాభం లేదు! ఒక్కొ సమయాన...ఐనా కిటికీదాకా వెళ్ళి గదిలోకి ఒక్కసారి చూద్దామనిపించేది! కాని ఆపని చేసేందుకు శర్మకు దమ్ములు చాలేవికాదు!

శర్మ రాత్రిళ్లుకూడా, కారుషెడ్డులోనే పడుకుంటున్నా డన్న సంగతి తెలుసుకున్నప్పటినుంచీ, కళ్యాణి, తనకు కనబడని దయ్యమేదో తనను ఎల్లవేళలా వెన్నాడుతూన్నట్టు భయపడ సాగింది.

ఒకనాటి సాయంత్రం మెల్లిగా యీ ప్రస్తావనను భర్త దగ్గర తెచ్చింది.

"అతనికి ఇల్లు లేదా ?"

"ఎవరికి ?"

"డ్రైవరుకు"

"ఏమో—నేనాసంగతి అడగ లేదు. ఇల్లుంటే; పాపం, ఇక్కడెందుకు పడి వుంటాడు? జీవితంలో పెద్దదెబ్బ తిన్న ట్టున్నాడు—పాపం!"

ఈ విధమైన సానుభూతి అన్ని వైపులనుంచీ శర్మ సంపాయించుకో గలగటం ఆమెకు ఏమీ ఇష్టం లేదు. కాని భర్తతో ఏమన్నా గట్టిగా చెప్దామన్నా, ఆమెకు నోరాడటం లేదు.

వారం రోజులు గడవక ముసుపే, కళ్యాణి బాగా మారిపోయింది. తల తిరిగి పోయేటంత ఆలోచనాధార మంతా ఆమె ముఖంలో ప్రతిఫలించేది. రాత్రిళ్ళు ఎక్కువసేపు మేలు కుంటూండటంవల్ల, ఆమె మెరిసే కళ్ళల్లో ఎరుపురంగు గొప్పస్థానాన్ని ఆక్రమించుకుంది. దుస్తులు ధరించటం లోనూ, తల దువ్వు కోవటంలోనూ, ఇతర కాలకృత్యాల్లోనూ ఆమెకు శ్రద్ధ తగ్గింది. జీవితంలో ఏ యితర విషయమూ తనదగ్గర ప్రాముఖ్యతను సంపాయించుకోలేదనే అనుమానం, ఆమెకు కలగటంలో కూడా ఆశ్చర్యం లేదు. ఎప్పుడూ నిర్లక్ష్యంగా, అన్యమనస్కంగా, తనభార్య తిరుగుతూ ఉండటాన్ని ప్రసాద్ కూడా కనిపెట్టాడు.

ఒకనాడు "నీ ఆరోగ్యం సరిగ్గా లేదా ?" అని అడిగాడు.

"లేకేం ?" అంది—తనకు చేత నైనంతగా నటిస్తూ.

"మరి ఎప్పుడూ పరాకుగా ఉంటావేం ?"

"ఏం—లేదు"

"నీ కిక్కడ బాగా లేదు కదూ ?"

"బాగానే వుంది."

"మరి— ?"

—ఆమె మాట్లాడ లేదు. సమాధానం ఎలా చెప్పాలో ఆమెకు తెలియ లేదు.

"ముఖమంతా పాలిపోయింది. కళ్ళలో మెరుపు తనమే లేదు. బహుశా నీకి నీళ్ళు పడలేదేమో ?"

"పడ కేం చేస్తాయ్—కొ త్తలో కా స్త ఇదిగా వున్నా—"

ప్రసాద్ దీనికి కా స్త సమాధాన పడ్డాడు. కాని ఏవో బాధతో కళ్యాణి మనసు చెడగొట్టుకుంటోందనే అతని అనుమానం మాత్రం తీరలేదు. ఇంతకన్న నొక్కి అడగటానికూడా అత నికి మనస్సొప్ప లేదు.

"ఎప్పుడూ ఇంట్లో కూర్చుంటావేం ? సాయంత్రం కుర్రాణ్ణి తీసుకొని షికారుకు వెళ్ళరాదా?"

తన మనసు బాగుచేసే సాధనాల్లో, ఈ షికారు కెళ్ళడమనే దొకటని భ ర్త నమ్మాడు. కాని ఇది తనకు ఎంత బాధాకరమో, ఎందువల్ల తను దీనికి ఒప్పుకునే పరిస్థితుల్లో లేదో, ఆమె ఎలా చెప్పకో గలదు ? ఐదారేళ్ళ నుంచీ షికారుకు వెళ్ళే తన అల వాటును కూడా భ ర్త ఇందుకు అధారంగా తీసుకున్నాడు.

"ఆ సముద్రపు గాలి నాకు బాగుండదు" అంది ఒకనాడు. దాంతో పాటే తనకు ఇంకా బాగుండనివి ఉన్నా, లేనట్టే నటిం చాలి. జీవితంలో ఎంత నటన వుందో ఆమె అనుభవంలోకి మరో సారి వస్తోంది.

"పోనీ, సినిమాకు వెళ్ళరాదా ?-సినిమాకు వెళ్ళి ఛాలా రోజులైందిగా—ఇవ్వాళ వెళ్దామా ?"

ఆమె కూడా తన మనశ్శాంతి కోసం కొన్ని కృత్రిమ సౌఖ్యాల్ని నిర్మించుకోవాలనే చూస్తోంది. ఇప్పుడు భ ర్తతో కలిసి సినిమాకు వెళ్ళటమంటే, ఆమెకు లేని ధైర్యం వచ్చింది. "సరే" నన్నట్టు తల తిప్పింది.

"సాయంత్రానికి ఇద్దరూ సిద్ధంగా ఉండండి" అని చెప్పి ప్రసాద్ కోర్టుకు వెళ్ళి పొయ్యాడు.

సాయంత్రాని కల్లా ఆమె కుర్రాడితోపాటే సిద్ధమై, భర్త రాక కోసం ఎదురు చూడసాగింది. ప్రపంచంలో తనకు లేని సంతోషాన్ని, ఇతర్ల ముఖాన చూసి, తను కూడా ఆ లేని సంతోషాన్ని నటించి, కొంత వరకూ మనశ్శాంతి సంపాయించటం కూడా సంభవమేననే ఊహ, ఆమెకు వదల లేదు.

మామూలు వేళ కన్న ఆలస్యంగా వచ్చాడు ప్రసాద్. వస్తూనే "సిద్ధంగా ఉన్నారా?" అన్నాడు. తల్లీ కొడుకు లిద్దరూ ఒక్కసారే తల తిప్పారు.

"కాని...నేను వచ్చేందుకు వీల్లేదు కళ్యాణీ! రేపటికల్లా తయారు కావాల్సిన రికార్డు చాలా వుంది...ఐనా ఆశాభంగం లేదులే! నువ్వూ, కుర్రాడూ వెళ్ళి రండి" అన్నాడు.

చీకట్లో వెళ్ళేందుకు - కాదు—శర్మతోపాటు ఒకే కారులో వెళ్ళేందుకు, ఆమె భయపడ్డది. అసలు ఒంటరిగా ఈ గోడలు అడ్డం ఉండబట్టి తనకు తనే బాధపడుతోంది కాని, బైట నైతే ఇతర్ల బాధకూడా తనను వేధించేదేమో?

"పోనీండి. రేపు వెళ్ళవచ్చు; తొందరేం?"

"ఎందుకూ! ఇంత సన్నాహమూ చేసి, ఇప్పుడు ఆగటం దేనికి? నీకేం భయం? ఇది వరకు నువ్వు ఒక్కతెవూ ఎన్ని సినిమాలకు వెళ్ళలేదు?"

కుర్రాడు కూడా ధైర్యం చెప్తున్నట్టు, "పో నీ, మనం వెళ్దామే!" అని తల్లి కొంగు పట్టుకొని లాగసాగాడు.

విసుగ్గా కుర్రాడివైపు చూసి, "ఏం—రేపు వెళ్ళకూడదా?" అంది.

"ఇవ్వాళైతే నేం?" అన్నాడు కుర్రాడు.

"బద్ధకంగా వుంది" అని వంక చెప్పింది కళ్యాణి.

ప్రసాద్ నమ్మనట్టు నవ్వి, "హాలుప్రవేశంతో అంతాపోతుంది." అన్నాడు.

ఆమె సమాధానం కోసం మాటల్ని వెతుక్కుంటోంది; ఒక్కో సమయాన మాటలకు కూడా కరువంటూ వుంటుంది కాబోలు! కుర్రాడు ఇప్పటికే బిక్కమొగం వేసి యీ చిన్న ఆశాభంగానికి బాధపడ సాగాడు.

ప్రసాద్ కుర్రాడి చెయ్యి పట్టుకొని, "పోనీ, అబ్బాయి కోసం వెళ్ళిరా" అన్నాడు.

కుర్రాడి ముఖం చూస్తే ఆమెకు జాలి కలిగింది కాని— మరి శర్మను చూస్తే కలిగే భయం మాటేమిటి?

"వెళ్ళు—ఇప్పటికే ఆలస్యమైంది" అని ప్రసాద్ తొందర చేశాడు.

ఆమె నరాలన్నీ లాగుతున్నయ్; తలవని తలంపుగా వచ్చిన యీ సంఘటనకు, అనుకూలంగా ఎలా మారాలో ఆమెకు అర్థమవ లేదు. భర్తనూ, కొడుకునూ, సంతోష పెట్టేందుకై వెళ్ళాలి. ఒక విధంగా తనకు తను ధైర్యం చెప్పుకో సాగింది. ఇంతా ఏదుస్తే, శర్మ తన కింద జీతానికి పనిచేసే వాడు; ఈ మాటను లోకమంతా అవునంటూ తన పక్షాన పలికేందుకు ఎప్పుడూ సిద్ధంగానే వుంది. అతను తన్నేం చేస్తాడని, అతన్ని చూసి, తన నీడకు భయపడ్డట్టుగా తను భయ పడాలి?

ఈ ధైర్యంతోనే భర్త వెనకాలే వెళ్ళి కారులో కూర్చుంది. ప్రసాద్ "థియేటరుకు పోనీ" అని చెప్పి, ఇంట్లోకి వెళ్ళి పొయ్యాడు.

కారు బయలుదేరగానే ఆమెను మళ్ళీ క్రమంగా భయం ఆవరించ సాగింది. అతని కళ్ళు! వాటిల్లో సూదంటు రాయి గుణ ముంది. అది ఒక్క స్త్రీలనే కాదు; పురుషుల్ని కూడా ఆకర్షించ గలదు. ఇందుకు తన భర్తా, కుమారుడే ప్రత్యక్షు నిదర్శనాలు. ఇన్నాళ్ళూ శర్మంటే ఒక పెద్ద అయిష్టతను కల్పించుకోవాలని ప్రయత్నిస్తూనే వుంది. కాని అది తన శక్తు లకు సాధ్యమవటం లేదు. మరీ వెనుకటి ఘట్టాలు జ్ఞాపకం వచ్చినప్పు డల్లా, అతనిపైని తను కోరని—కోర కూడని... ఇష్టత-అతి వేగంతో తన హృదయ మంతటా వ్యాపించ సాగింది. ఇతనితో వెళ్ళటంలో, తన సమాన బలం గల ఇంకో వ్యక్తితో జీవిత సమస్య తీరే పోట్లాటకోసం వెళ్తూన్నట్టని పించింది. హాలు చేరేదాకా ఆమె మనస్సు మనస్సులో లేదు.

బాల్కనీలో కూర్చుని, హాయిగా సినిమా చూస్తూన్న ఇతర్ల వలె, ఏ ఆనందమూ పొందలేక పోయింది. అసలు ఇంతమంది తమ జీవితంలోని విచారాన్నంతటినీ, యీ కాస్సేపూ మరిచిపో గలిగి, యీ వెధవ సినిమాతో ఎలా ఆనందాన్ని సంపాయించ గలుగుతున్నారో ఆమెకు అర్థమవలేదు. పూర్వం తను ఎలా ఆనం దాన్ని అనుభవించ గలిగిందో గూడా ఆమె ఊహించ లేక పోయింది...కాని, తను పొరపడు తోందేమో? జీవితంలో ఎంత నటన ఉన్నా ఒక్కో సమయానైనా అది మాయ మవుతూ వుండాలి. అసలు నిజంగా ఆనందాన్ని అనుభవించే వ్యక్తులు

కూడా, లోకంలో వున్నారు! అది తనకు దొరక్కపోవటం వల్లనే, తనకుప్రపంచమంతా విచారమయంగా కనిపిస్తోందేమో?

సినిమా మీద ఆమెకు దృష్టే లేదు. మనశ్శాంతి డబ్బుతోనే కొనగలిగేదైతే ఎంత బాగుండేది! సగం ఆట అయ్యేప్పటికల్లా కుర్రాడు గాఢ నిద్రకు ఉపక్రమించాడు. ఇక యీ సినిమా తనకు తల నెప్పికూడా తెప్పించేట్టుంది. త్వరగా ఇంటికి వెళ్ళి వంటరిగా మామూలుగా బాధ పడటమే ఆమెకు మేలనిపించింది.

బాల్కనీ ఇవతలకి వచ్చి కళ్యాణి బైటికి చూసింది. శర్మ కారు ఫుట్‌బోర్డు మీద కుడికాలు మోపి, తన మామూలు దృష్టితోనే ఎదుటవున్న ఎలెక్ట్రిక్ లైటు మీదికి సిగరెట్ పొగ వదుల్తున్నాడు. పాపం, అతని జీవితంలో ఎంత నిర్లక్ష్యత ఏర్పడ్డది! తనకు తెలియని దేనికో బతుకుతున్నట్టుగానూ, తనకీ లోకం చేసిన అన్యాయానికి, తన చేతకాని తనాన్నే దీన దృష్టుల్తో చెప్పుకుంటూన్నట్టూ, ఆమెకు తోచింది.

మళ్ళీ మామూలు మనిషవగానే, కళ్యాణి అతన్ని ఎలా పిలవాలో, ఏ విధంగా మాటాడాలో, అర్థంకాక అక్కడే నిలబడ్డది. ఐదారు నిమిషాలు కాగానే, శర్మ ఉన్నట్లుండి తల ఆమె వైపు తిప్పాడు. వెంటనే సిగరెట్ పారేసి ఆమె వైపు పరుగెత్త సాగాడు. శర్మ చూపిన చూపుకు వెంటనే లోపలికి పోదామని ఆలోచిస్తోంది కళ్యాణి—కాని అప్పుడే తన యెదుటకు వచ్చి తన ఆజ్ఞకోసం వేచికూర్చున్న వాడిలాగు శర్మ నిలబడ్డాడు. తనకు శర్మ ఇంత విధేయత చూపటంకూడా ఆమెకు కష్టంగానే వుంది.

తనెందుకు క్షణ క్షణానికీ యీ శర్మను చూసి భయపడాలి? అతను తనకు అంత దగ్గరగా నిలబడ్డాక—దూరంగా ఉన్నప్పుడు అతను కలిగించే భయంలో, ఇప్పటిది ఒక భాగమే ననేది స్పష్టమైంది. పన్నెండేళ్ళకూ, ఇప్పటికీ జరిగినమార్పుల్ని బట్టే నడచుకోవాల్సిన — కనీసం నటించాల్సిన మానవుల్ని గూర్చి, తను అపోహ పడటంలో కూడా అర్థం లేదేమో!

"ఇంటికి వెళ్దాం...కుర్రాడు నిద్రపోతున్నాడు—" అంది మెల్లిగా, వేరే దిక్కు చూస్తూ.

శర్మ లోపలకి వెళ్ళి కుర్రాణ్ని భుజాన వేసుకొని వచ్చి వెనుక సీటులో పడుకోబెట్టాడు. కారులో ఎక్కేప్పటికే ఆమె హృదయం మళ్ళీ బరువెక్క సాగింది. కారు బయలుదేరే ముందు — ఎన్నాళ్ళ నుంచో బిగపట్టుకున్న ఊపిరి వదుల్తూన్నట్టు, శర్మ విడిచిన ఆ పెద్ద నిట్టూర్పు; ఆమెను—ఎందుకనో — మామూలు కన్న ఎక్కువగా భయ పెట్టింది.

కారు బయలు దేరింది. కొంత దూరం వెళ్ళేదాకా, ఆమెకు అది ఇంటాక వచ్చిన త్రోవ కాదని తెలియ లేదు. ఆమెకు ఇంత వరకూ వేస్తూన్న అనుమానమే ఆమె జాగ్రతను కాపాడుకో సాగింది.

"ఇంటికి వెళ్ళాలి-" అంది, కోపంతో కూడిన అధికార స్వరంతో.

కాని ఆమె మాటలకు యీ సమయంలో మాత్రం విలువ లేక పోయింది. శర్మ అసలు ఏ మాటల్నీ విననట్టే, కారు వేగంగా నడుపుతున్నాడు.

ఆమె మళ్ళీ మాట్లాడేందుకు శక్తి కూర్చు కునేప్పటి కల్లా కారు జనసమ్మర్ద ప్రదేశా లన్నింటినీ గడిచి పోయింది.

"ఇవెక్కడికి ?" అం దామె గొంతెత్తి.

"నీతో మాట్లాడాలి" అన్నాడు శర్మ.

ఆమె భయంతో ఒణుకుతూ, లేచి నిలబడేందుకు ప్రయత్నిస్తూ, అంది: "ఇప్పుడు కాదు—తరువాత మాట్లాడవచ్చు."

కాని శర్మ వినిపించుకో లేదు. కారువేగం క్షణ క్షణానికీ ఎక్కువౌతూనే వుంది.

"జాగ్రత్త—అరుస్తాను" అం దామె.

"అరుపా ? ఇక్కడ నీ కెవరు పలుకు తారు ?"

ఈ మాటల్తోపాటే కారు కూడా ఆగింది. తను ఎక్కడ వుందో ఆమెకు తెలియ లేదు. కారు ముందున్న లైటు మాత్రం ముందున్న చెట్లగుంపుల్లో తమకు శక్తి వున్నంత వరకూ వెలుగును చూపు తున్నయ్. అటూ ఇటూ గాఢాంధ కారం ఆవరించి వుంది. ఆకాశంలోని నక్షత్రాలూ, కింది గడ్డిలో అక్క డక్కడ మెరిసే మిణుగురు పురుగులూ చీకటితో పోట్లాడ లేక పోతున్నాయి. ఈ భయంకర ప్రదేశంలో, ఆమె ప్రాణాని క్కూడా భయ పడ్డది. ఏం చేద్దామన్నా ఆమెకు పాలు పోవటం లేదు: అతనా—తనకన్న బలవంతుడు. తనా—తనకున్న శక్తి నంతటినీ తప్పని సరిగా దాచు కోవాల్సిన అబల ! ఎవరి దగ్గరా ఏమి చెప్పు కునేందు కైనా వీలులేని పరిస్థితులు ! అసలు ఒద్దను కుంటూనే తను యీ వెధవ సినీమాకు ఎందుకు రావాలి ? ఇలా తనను అగౌరవించటంలో అతని ఉద్దేశ మేమిటి ? తను అరుస్తే ఏమన్నా ప్రయోజనం వుంటుందా ? క్షుద్రాణ్ని లేపటం మంచిదా ?...ఇన్ని ఊహలూ కలిసి ఆమెను రెండు మూడు నిమిషాల పాటు నిర్జీవ ప్రతిమను చేసినయ్.

"నేను నిన్నేమీ చెయ్యను...నువ్వు భయపడ క్కర్లేదు." అన్నాడు శర్మ.

ఆమె మాట్లాడ లేదు. భయపడి లాభం లేదని తేలి పోయింది. తనకు తనే ధైర్యం చెప్పు కునేందుకు ప్రయత్నిస్తోంది. తీరా నీళ్ళల్లోకి దిగాక, మాయమయ్యే చలిలాగు, ఆపద ఇంత సమీప మయ్యేప్పటికి, ఆమె భయం కూడా క్రమ క్రమంగా క్షీణించ మొదలిడింది.

"నన్ను మరిచి పొయ్యావ్ కదూ ?" అన్నాడు.

ఎంత మధురంగా అడిగాడు ! తన బాధకు దేనికో అతను కని పెట్టిన మందులాగుంది ఆ కంఠం !

ఆమె తనకు తెలియ కుండానే మాట్లాడ సాగింది : "మరిచి పొయ్యానా ? మరిచి పొయ్యానా ? లేదు : నేను మరిచిపోలేక పొయ్యాను."

"అది చాలా పాతకథ !"—అంటూ నవ్వాడు—శర్మ.

"ఔను...మొదట నీకోసం ఎంత విచారించాను !...ఇప్పుడు ఇంత క్రూరంగా నిన్ను మరిచి నందుకు నన్ను నేను ఎంతో దూషించు కున్నాను !"

ఇవి శర్మకు నమ్మదగ్గ మాటలుగా కనిపించ లేదు.

వ్యంగ్యంగా "అలాగే ఈ భర్తతో హాయిగా కాపరం చేస్తు న్నావ్ ?" అన్నాడు.

"అంతా అయ్యాక ఏం చెయ్యను ? ఎవర్ని దూషించి మాత్రం ఏం లాభం ? నేను అనుకున్న విధంగా జీవితం నడవ లేదు ; జీవితమే నన్ను నడిపే యంత్ర మైంది. తప్పని సరిగా ఎదుర్కొన్న సమస్యలకు ఓడిపోయి, యీ భర్తతోనే సరిపెట్టు

కున్నాను...ఈ ఐశ్వర్యాన్ని చూచి, యీ కారును చూసి, ఈ విలువైన దుస్తులతో పాటే అవహించిన గర్వాన్ని చూసుకొని సంతుష్టి చెందాను. ఇలాటి సౌఖ్యాలతో, మనశ్శాంతి సంపాయిం చేందుకు ప్రయత్నించాను. ఒకనాడు కాదు, రెణ్ణాళ్ళు కాదు, నాలుగు సంవత్సరాలకు కాని, నేను నెగ్గ లేదు...ఏడు, ఈ కుర్రాడు పుట్టిన నాటినుంచీ నా అనురాగాన్నీ, ఆశల్నీ, జీవిత సర్వస్వాన్నీ వీడిమీదనే కేంద్రీకరించుకొని, నా జీవితానికల్లా, చిక్కిన ఏకైక సౌఖ్యమల్లే భావించుకొని, మనశ్శాంతి పొందాను—''

శర్మకు కోపం వచ్చింది, ఆమె మనశ్శాంతిమాట వినగానే అతను ఎక్కడలేని యీర్ష్యకూ గురి అయ్యాడు. కాని వెంటనే ఉన్నది ఉన్నట్టుగా వెలిగక్కకుండా, "నువ్వు అబద్ధమాడుతున్నావ్'' అన్నాడు.

"నేనా...అబద్ధాలా ? ...శర్మా ! నాకుర్రాడితోడు—నేను నిజం చెప్తున్నాను !'' అంది, దుఃఖం క్రమంగా ఆవరించుకుంటూన్న గొంతుతో.

"నువ్వు నీకై యీ జీవితాన్ని కోరుతున్నావ్ ; నీతోపాటే నన్ను కూడా నాశనం చేశావ్. నేను—ఇల్లు వదిలాను. ఐనవాళ్ళందర్నీ వదిలాను—లోకంలో ఒక్క మిత్రుడనే వాడు కూడా లేకుండా—జీవయాత్ర సాగించాను. ఏకాకిగా జీవితాన్ని ఎదుర్కొన్నాను—''

అతని మాట పూర్తి కాకముందే ఆమె అంది. "అంతా నా తప్పేనా ? నేనేం చేశాను ? నేనేం చేశాను? జీవితం నేను చెప్పినట్టుగా విన్నదా? నాకోర్కె ప్రకార మేమన్నా నడిచిందా?

జీవితమూ మనుషులూ, నన్నూ, నా శక్తుల్నీ కట్టేసి నడుపుతున్నారు. నీకు తెలియదా శర్మా! ఇంటి పరిస్థితుల ఒత్తిడివల్ల యీ పెళ్ళికి ఒప్పుకున్నాను; సంతానానికల్లా పెద్దదాన్నవటం వల్ల, అప్పుడే ఏమనుకున్నానో తెలుసా? నా శరీరంలోని రక్త మాంసాలతో తయారు చేయబడ్డ హృదయమే నశించినట్టను కున్నాను. ఒక్క త్యాగంతో—ఒక్క ప్రాణి బాధతోనన్నా, కుటుంబాన్నంతట్నీ బాగుచెయ్యొచ్చునని తలిచాను. భగవంతుడి దయవల్ల, యీ వివాహంతో నా పుట్టిల్లు బాగుపడ్డది. ముసలి తల్లి దండ్రులకు మనశ్శాంతి లభించింది. చదువుకున్న తమ్ముళ్ళిద్దరికీ ఉద్యోగాలు దొరికినాయి. నా చెల్లెలికి మంచి సంబంధం దొరికింది...నాకు ఎవరి మీదా కోపం లేదు శర్మా! నేను ఒక్క విషయాన్ని మాత్రం గట్టిగా నమ్ముతున్నాను. మన అదృష్టానికి కానీ దురదృష్టానికి కానీ, సౌఖ్యానికి కానీ, కష్టాలకు కానీ, ఇతర్లను కారకులుగా తీసుకొని తృప్తి పడటంకన్న, అవి మన తప్పులుగానే భావించుకోవటం మంచిది; న్యాయం కూడా అదేనేమో? అందుకనే నేను అనుభవించిన బాధకు నిన్ను కారకుణ్నిగా తీసుకొని ఏం లాభం? నీ జీవితానికి కూడా నేను జవాబుదారీ కాదు. అదృష్ట వంతుణ్ణి చెరిచేవాడూ, దురదృష్ట వంతుణ్ని బాగుచేసే వాడూ లేడు! విధి నాకు ప్రసాదించిన సౌఖ్యాన్ని అనుభ వించటం కన్న, ఇంతకన్న సౌఖ్యం లేదే అని విచారిస్తూ, ఉన్నదాన్ని కూడా పాడు చేసుకోవటం ఏం లాభం?''

ఆమె కంటివెంట నీరు కారుతోంది. శర్మ అంతా విన్నా, ఒక్క మాట కూడా అర్థం చేసుకో లేదు. అసలు అతని ఊహలే వేరు. ఆమె నోటివెంట—ఇప్పటికైనా—నీవేనాకు దైవం అన్నమాటమ

వినాలని కూర్చున్నాడు. ఆనాటి స్నేహమే, ఇతర అడ్డంకులు లేకుండా, యీ నాటివరకూ పెరిగి నట్టయితే, ఆమె ఏ విధంగా మాట్లాడి వుండేదో—ఆరకం మాటలనే వినాలని ఎదురు చూస్తు న్నాడు.

"సరే...చాలా వేదాంతాన్ని చెప్పావ్. ఇప్పటికన్నా, నువ్వింత వరకూ వదులుకున్న సౌఖ్యాలకయి ఎందుకు ప్రయ త్నించవు ?" అన్నాడు శర్మ.

"ఎట్లా"?

"ఎట్లాగా?...ఇప్పటికీ నేను కావాలా అక్కర్లేదా?"

"నువ్వు లేకపోతే యీ జీవితమే లేదు; నువ్వు పీల్చి వదిలే గాలి లేకపోతే నా శ్వాసే ఆగిపోతుంది"...అని ఆమె అంటుం దను కున్నాడు పిచ్చి శర్మ !

కాని ఆమె యీ ప్రశ్నకు వెంటనే సమాధానం చెప్పలేక పోయింది; ఒక్క నిమిషం శూన్యంలోకి చూసి, శర్మవైపు చూడ కుండానే అంది: "అది నన్ను అడగవద్దు శర్మా! ఆ కలలో, బాధనే అనుభ వించామో, సౌఖ్యాన్నే అనుభ వించామో, ఇవాళ ఆలోచిస్తూ బాధపడటం కన్న, ఇవాల్టి సౌఖ్యాన్నే అనుభవించటం ఉత్తమం—"

"అందుకనే—"

శర్మ మాటకు అడ్డు వచ్చి, "ఆ మాట లేమీ వద్దు. నిజం చెప్తు న్నాను. నేను జీవితంలో తిరిగి నిన్ను చూడగోర లేదు. అందుకనే నువ్వు ఎదురైన నాడు, నావిధిని నేను దూషించు కున్నాను—" అంది కళ్యాణి.

శర్మ కోపంతో గట్టిగా నవ్వి, "నామీద ఇష్టం లేనట్టు యీ మాటలే చెబుతున్నయ్ !" అన్నాడు.

"కాదు శర్మా! నే నిలా ఎందుకు కోరా నసుకున్నావ్? నువ్వు మళ్ళీ కనిపిస్తే హృదయంలో అడుగున పడిపోయిన అనేక పాత విషయా లన్నీ జ్ఞాపక మొచ్చి బాధపడతానని! ఇంతదూరం జీవితంలో ముందుకు సాగాక, వెనుక నడిచిన దారిని చూడటం ఎంత బాధావహమో నీకు తెలియదా?"

శర్మ మాట్లాడ లేదు. ఆమె చెప్పిన మాటల్ని జీర్ణించు కునేం దుకు ప్రయత్ని స్తున్నాడు—మళ్ళీ ఆమె అంటుకుంది: "నువ్వు పనిలో చేరిన ఆ సాయంత్రంనుంచీ, నేను ఈ పన్నెం డేళ్ళ నుంచీ బతుకుతూన్న కళ్యాణిని కాదు! జీవిత రాక్షసి బరువైన హస్తం అప్పుడే మీదపడగా, పెద్ద మైకంనుంచి మేల్కొన్న కళ్యాణిగా మారాను. నా మనశ్శాంతంతా భంగమైంది. రాత్రులు నిద్రే లేదు. జీవితంలో నన్ను ఆనందింప జేసే ప్రతి వస్తువా, తన పనిని మానుకుంది. నిన్ను చూడట మంటేనే భయంగా వుంది. ఇలా మరికొద్ది రోజులు సాగుతే, పిచ్చి కూడా ఎక్కుతుందనే భయంగా వుంది.ఇది నిజం—నమ్మవా శర్మా?"

ఆ చివరిమాట శర్మమీద బాగా పనిచేసింది; మాటకన్న ఎక్కువగా ఆమె కంఠమే అతన్ని నమ్మించింది. కొద్ది రోజుల నుంచీ, అతనిలో పనిచేస్తూన్న దుష్ట తలపు లన్నీ, దూరాలకు తరిమివేయ బడినయ్. పెద్ద ఆత్మ విశ్వాసంతో పోరాటానికి దిగి, అనుకోకుండా ఓడిపోయిన పెద్ద వస్తాదులాగున శర్మ నిశ్చేష్టుడై నిలబడి పొయ్యాడు.

"నా జీవితానికి కుర్రాడు తప్ప ఇంకేమీ అక్కర్లేదు. నా మనశ్శాంతి అంతా వాడి మీదనే ఆధారపడి వుంది. నన్నూ, వాణ్ణీ కరుణించు.... నేను నీ నుంచి కోరేది ఇది ఒక్కటే—"
అన్నది కళ్యాణి గాద్గదిక కంఠంతో.

"ఏమిటీ?" అనగలిగాడు శర్మ. ఇప్పటికే ఆమె కన్నీరు అతని హృదయాన్ని తాకకుండానే కరిగించివేయ గలిగింది.

"నువ్వు సాధ్యమైనంత త్వరలో యీ ప్రదేశాన్ని వదలి వెళ్ళిపో. నన్నూ, నా కుమారుణ్ణీ, భర్తనూ, ఎప్పటి లాగా బతకనీ! ఉన్న సమస్యలకు తోడు నువ్వు ఎదురుగా ఉండి ఇచ్చే సమస్యే ఎక్కువై పోయింది. ఆ బాధను, నాలాటి సున్నిత జీవితానికి అలవాటు పడ్డ మానవప్రాణి భరించ లేదు......నువ్వు వెళ్ళిపో—ఎక్కడికైనా సరే! ఈ మాటను నేను ఏ అధికారం తోనూ అనటం లేదు. మానవుడు మానవుడి నుంచి కోరదగ్గ సాను భూతికోసం...దయకోసం...నిన్ను ప్రార్థిస్తున్నాను—" అన్నది కళ్యాణి కన్నీరు తుడుచు కొంటూ.

ఈ రకం మాటల్ని శర్మ యిక వినదలచుకో లేదు. ఇప్ప టికే అతని శక్తులన్నీ కట్టివేయ బడినయ్. తన హృదయం కొట్టుకోవటాన్ని, అతను స్పష్టంగా వినగలు తున్నాడు. తను పరాజితుడైన ఈ ప్రదేశాన, అత నింక ఉండదలచుకో లేదు. చప్పున కారు స్టార్టు చేశాడు.

ఆమె అంది: "ఇలాంటి సంఘటనలు ఇక జరుగ వద్దు. నన్ను విడిచిపో, ఈ క్రూరురాల్ని, నీ కళ్ళ ఎదుట ఎందు కుంచు కుంటావ్ శర్మా!"

అతను సమాధానం చెప్ప లేదు. అసలు ఇంతవరకూ ఏమీ జరగ నట్టుగానే, మామూలు కారు డ్రైవరు మొహంతో, ఎలాగో కారును ఇంటిదాకా లాక్కు రాగలిగాడు!



పడుకున్న గంట దాకా శర్మ మామూలు మనిషి అవనే లేదు.

ఈ రాత్రి తను చెప్పదలుచుకున్న వాంట్లో నూరో వంతు మాటల్నికూడా, కళ్యాణి దగ్గర చెప్ప లేక పొయ్యాడు. తను ఇంత వరకూ ఆలోచించిన హేతువాదమంతా, సమయానికి మరిచి పొయ్యాడు. ఆమె తనను — చిన్న పిల్లాడికి కాకమ్మ కథ చెప్పి మరిపించినట్టు — ఇంకో లోకానికి లాక్కుపోయి, తన శక్తులన్నింటినీ, కట్టివేయ గలిగింది! ఆమెలో ఉండే మాతృత్వ మంతా, తనను చిన్న కుర్రాడిగా చేసి వేసింది.

ఏ విధంగా తనకు ఓటమి సమకూరిందో, మొదట్లో అతనికి అంతు పట్టలేదు...కొంత ఆలోచన మీదట తేల్చుకున్నాడు— ఒణికే ఆమె కంఠం, తనను అర్థించే దయా, జాలీ, ఆమె కన్నీటి రూపాన వదిలిన శస్త్ర పరంపరా, తనను ఎందుకూ పనికిరాని వాణ్నిగా చేసినయ్. కాదు—ఆమె తనను యీ నాటికీ హృదయ పూర్వకంగా ప్రేమిస్తూండ బట్టే, ఆమెకు అంత తేలిగ్గా లొంగిపో గలిగాడు. అదే ఇంకో స్త్రీ దగ్గరైతే, తన విజ్ఞాన మంతా పనిచేసి తీరేది! తను మొండిగా చేసుకున్నాననుకొని, అపోహపడ్డ రక్తమాంసాల్ల హృదయం, తనకు విశ్వాసంగా పని చెయ్య లేదు. బలహీనుడికి కన్నీరు కొత్త బలాన్ని ఇవ్వ గలదు కాబోలు!

అతను మెల్లిగా, కళ్యాణి మాట్లాడిన ప్రతి మాటనూ నెమరు వేసుకుంటూ, ఒక్కొక్క విషయాన్నే, తనలో తను విమర్శించుకో సాగాడు.

ఆమె హాయిగా బతుకుతూంటే, తనొచ్చి ఆమె సౌఖ్యాన్ని పాడు చేశాడట! ఇది తన క్రూరత్వాన్ని చూపటం కాదు; తన

మీద ఆమెకున్న ప్రేమనే చాటుతోంది. ఇది నిజమే ఐతే, తనకు ఎప్పటికైనా విజయం తప్పదు. కనపడని యీ ప్రేమపాశంతో కళ్యాణిని—అందాల రాశిని—సాంఘికంగా బలమైన స్థానాన్ని సంపాయించుకోగలిగిన యీ కులీనురాల్ని—యింకోర్థి ఆ స్త్రిలో భాగంగా పరిగణిస్తూన్న లోకాన్ని మోసపుచ్చి, దాని మొహంలో విజయ సూచకంగా వికటంగా నవ్వినట్టు-ఎరను చూసి ఆశ పడే చేపలాగు, విశ్వాసంతో యజమాని కాళ్ళ చుట్టూ తిరిగే పెంపుడు కుక్కలాగు — ఆమెను తన చుట్టూ తిప్పించుకో గలుగుతాడు!...ఇంకో విషయం కూడా అతనికి చప్పున జ్ఞాప కం వచ్చింది. ఇది తను ఇన్నాళ్ళూ గుర్తించని "బ్రహ్మా స్త్రం!" దీని ప్రయోగంతో ఆమె కాళ్ళపై పడగలదు! ఆమెను జయించటమే తనకు ముఖ్యోద్దేశం కనుక, ఏ విధంగా నైనా గెలవటమే తనకు కావాలి!

కళ్యాణి తనను పొమ్మన్నది. అందుకు తను సమాధానం ఇవ్వ లేదు. ఒకవేళ తను ఒప్పుకొనివున్నా, మించి పోయిం దేమీ లేదు. మానవులకు వాగ్దానాల్ని చెల్లించట మొకటే ఆదర్శమైతే, అనేక జీవితాలే తల్లక్రిందులై ఉండేవి!...తనెం దుకు వెళ్ళిపోవాలి? పొట్టను చేత్తో పట్టుకొని, లోకాన్ని గాలి స్తూన్న తనకు, ఇక్కడ జీవనోపాధి దొరికింది. ఈ కాస్తా పాడు చెయ్యటంలో ఆమె ఉద్దేశ మేమిటి? తను ఐశ్వర్యవంతు రాలిననీ, తనకన్న తక్కువ వాళ్ళందరూ తనకై త్యాగం చేసేందుకు సిద్ధంగా ఉండాలనీ, ఆమె అభిప్రాయం కాబోలు! ...కోపాన్ని క్షణక్షణానికీ అంతరాత్మ సహాయంతో ప్రజ్వలింప చేసుకుంటూ—ఎరగా కళ్యాణిని నిలబెట్టి, శర్మ ఈ పరీక్షకు దిగాడు.

ఆమె ఎందుకు సౌఖ్యపడాలి? ఒకే సమస్యను ఎదుర్కొన్న ఇద్దరు వ్యక్తులు, ఒకరు దక్షిణ ధృవానా, వేరొకరు ఉత్తర ధృవానా తేలారు; ఒక్కో సమస్యకు రెండేసి తలలు కాబోలు! ...తనెందుకు బాధ పడాలి? అసలు లోకంలో సౌఖ్యమనేది, తన కళ్ళ యెదుట, తనకు చిక్కకుండా ఇతర్లపాలెందుకవాలి? తను బాధపడుతున్నాడు — తనతోబాటే లోకమంతా బాధపడితే ఎంత బాగుండును! తను సౌఖ్యపడటం కన్నా ముఖ్యమైనది ఆమె బాధపడటం! తనకు అందని ఫలం ఇతర్లు —ఎవరైతేనేం - అందుకోగలగడం మానవుడైన శర్మకు మొయ్యలేనంత భారంగా కనిపించింది...

ఇంకా ఆమె సౌఖ్యానికని తను త్యాగం చెయ్యాలట! శర్మ తనలో తను క్రూరంగా నవ్వుకున్నాడు. తను ఎవరి కోసమని ఇంత జీవితాన్ని వ్యర్థం చేసుకున్నాడు? అందువల్ల తనకేం లాభం? తన కోసమే తను త్యాగం చేసుకోలేని శర్మ-ఆమె కోసం త్యాగం చెయ్యాలనే ఉద్దేశాన్ని ఎలా రానివ్వగలడు? ... ఆమె కుటుంబాన్నంతటినీ బాగు చేసుకుందట! కాని తన కుటుంబమంతా యీ సరికి నాశనమై వుంటుంది. అంతతో పోక, తనను ఇంకా అధఃపాతాళానికి తొక్కాలని చూస్తోంది. ఎంత స్వార్థం!

ఆమెను చూసి తను నేర్చుకోవాల్సిన గుణపాఠం వొకటి తనకు కనిపించింది. అది తన సౌఖ్యానికై, ఇతర్లమీద జాలిపడకుండానే, గట్టిగా ప్రయత్నించటం! ఆమె జీవితంలోని ఆమె అవసరాలకై తనను ఎలా ఉపయోగించుకోవాలని కుటిలంగా

ప్రయత్నించిందో, అలాగే తనూ ప్రయత్నించాలి. దుర్మార్గులను జయించాలంటే దుర్మార్గంకన్న బలమైన ఆయుధం ఉండ బోదేమో?

ఇది ఎలాటి పరిణామానికి లాగినా, దీనిపైనే శర్మ తన జీవిత భారాన్నంతటినీ మోపుకొని తూచుకున్నాడు. తన రాణింపో, క్షీణింపో చివరిసారి జీవితంలో ఏకాకిగాపోట్లాడి తేల్చు కోదలచాడు. తేల్చుకోక పోతే, తన ఆయువులో ఇక మిగిలిన కొద్ది రోజులుకూడా వృథాయే!...తనకు అనుభవం వుంది; దేశ దేశాల నీళ్ళూ తన రక్తంలో ప్రవహిస్తూ, రక రకాల ఆలోచనల్ని ఇవ్వగలవు. తను చూసిన అనేకమంది ప్రవర్తనలు తను మొట్టమొదటి వాడై, నష్టపడకుండా చెయ్యబోయ్యే పనికి ఇదివరకే లాగిన ఫలితాలుకూడా తనకు అందుబాటులోనే ఉన్నయ్.

ఈ విధంగా అతను ముందు తనకు తను నచ్చజెప్పు కున్నాడు. తను చెయ్యబోయ్యే ప్రతిపని కూడా, మానవసహజ మైనదనీ, ప్రతిప్రాణీ విధిగా తన సౌఖ్యానికై పాకులాడటంలో తప్పు లేదనీ తన అంతరాత్మకు నచ్చచెప్పుకున్నాడు. ఈ సారి కూడా, తన శక్తులు తనను మోసంచెయ్యకుండా, ఉండే టందుకై అనేకసార్లు పైవిషయాల్నే 'రిహార్స్' చేసుకున్నాడు. ఆమెతో మాట్లాడేప్పుడు ఉపయోగించాల్సిన కంఠధ్వనిని కూడా జ్ఞాపకం పెట్టుకున్నాడు...ఈసారి తనకు తిరుగు లేదు; ఏది తప్పిపోయినా తన 'బ్రహ్మాస్త్రం' తప్పేందుకు వీల్లేదు!

తెల్లవారుజాము మూడు గంటలైనా, కళ్యాణి గదిలోని లైటు ఇంకా ఆర్పివేయ బడక పోవటం, శర్మను కాస్త ఆశ్చర్య

పెట్టింది. తనిక్కడికి వచ్చినరోజునుంచీ యీ వింతను చూస్తూనే ఉన్నాడు; కాని నిజమేమిటో అతని ఊహకు అందలేదు. తనలాగే ఆమె కూడా బాధ పడుతోందా? మొదటి నాటినుంచీ లోపల ఏం జరుగుతోందో తెలుసుకోవాలనే కుతూహలం అతనిలో నానాటికీ అధిక మవుతూనే వచ్చింది. ఇక యీ నాడు అది అతని స్వాధీనం కూడా తప్పింది.

మానవ ప్రపంచానికి ఇది గాఢతమ నిద్రాసమయం: తనను ఇప్పుడు ఎవరు చూడ బొయ్యారు? తనిలా భయపడుతూ, తనను తనే నిరుత్సాహ పరుచు కుంటూండటం మూలానే, జీవితం తనపైన సవారీలు చెయ్యగలుగుతోంది. తనిక యీ మానవుల్ని, లోకాన్ని, భయపెట్టాల్సిన సమయం వచ్చింది. ఇందుకు మొట్టమొదటి నమూనా పాఠంగా, యీ సంఘటననే తీసుకున్నాడు. ముందు జరగాల్సిన నాటకంలో యీ చిన్న భాగానికే భయపడితే—తన ధైర్యాన్ని తనుఇక్కడ పరీక్షించుకునేందుకే వెనుకంజ వేస్తే...ముందు తనకు కలిగే ఫలితం స్పష్టం! తనకు తను హేతువాదంగా నచ్చ జెప్పుకొని శ్రమ పడటంకన్న—మందో చెడో తెగింపు లేకపోతే, ఏమీ లాభం లేదనే సిద్ధాంతాన్ని నమ్మాడు. ప్రాణానికి కూడా తెగిస్తే—తనకు అంతా సౌఖ్యమే! చిక్కితే, ఇటు కళ్యాణి చిక్కుతుంది; తన భావి జీవితమంతా వెలు గవుతుంది. లేదా, తను ప్రాణం పోగొట్టు కున్నాక—యీ బాధలూ, యీ సమస్యలూ మరి వుండవు! రెండు వైపులా పదునైన యీ కత్తి చాలా ఉపయోగంగా తోచింది!

అతనికి ఆ క్షణంనుంచే లోకము, మనుషులు, నీతి, గౌరవము, తన స్థానము మొదలైన అటంకాలు కనిపించటం లేదు.

మొదట సగం దూరం వెళ్ళి, వెనక్కా, ముందుకా, అనే ప్రశ్నతో ఒక క్షణం ఆగి, మళ్ళీ ధైర్యం చేసి ఆమె గది కిటికీవైపు నడవ సాగాడు.

తనకు పైగావున్న కిటికీలోకి, ఒకసారిగా పాకేందుకు అనుమానించి, లోపల మనుషుల అలికిడి ఏమన్నా వుందేమో నని జాగ్రత్తగా చెవులురిక్కించి కూర్చున్నాడు. బైటిగాలి గదిలో ప్రవేశించే ముందు కిటికీచువ్వల్ని తాకుతూచేసే సన్నని శబ్దం తప్ప అతనికి మరేమీ విన రాలేదు. మెల్లిగా అతను కిటికీ లోకి ఎగబాకాడు.

గదిలో కుర్రాణ్ని దగ్గరకు లాక్కొని కళ్యాణి నిద్రపోతోంది. లైటుమాత్రం, ఆమె ఏమరుపాటున వున్నా, తను విశ్వాసాన్ని చూపే వస్తువేనన్నట్టు వెలుగుతోంది. రోజూ ఇలాగే ఆమె లైటు వేసి వుంచుతోందన్న మాట! కారణం శర్మకు తెలియ లేదు. కాస్త పరీక్షమీద శర్మ ఇంకో చిత్రాన్ని గమనించాడు. నిద్రిస్తూన్న ఛాయలు పడే కనురెప్పల్ని తోసుకొని, అంతకు కాస్త ముందుగా, నున్నని ఆ చెంపలమీద, గాలి పీల్చుకుంటూన్న ఆమె కన్నీటిబిందువుల్లో ఎలెక్ట్రిక్ లైటు తన పాపల్ని చూచుకుంటోంది! ఆమె ఏడుస్తోందా? నిద్రలోకూడా బాధపడుతోందా? తనమీది నుంచి తిప్పుకోలేని మనస్సుతో పోరాడి అలసి వేగిపోతోందా?...

శర్మ యీసారి చప్పున తన బలహీనత్వాన్ని గ్రహించ గలిగాడు. ఆమెకన్నీరు—నీళ్ళలో నిప్పుకుమల్లే—తనను పెడత్రోవల పెడుతోంది. ఆ కన్నీరుచూసి తనుపడే జాలే తన ఓటమికి కారణం! తనెంత ధైర్యంగా యీ పోరాటంలోకి వెళ్ళినా, ఆ

దయను వదలి, కటికగుండెను ప్రదర్శిస్తే తప్ప లాభం లేదు! దయ యెంత ప్రమాదమైంది!...ఇక ఆ ప్రదేశంలో తను ఎంత సేపుంటే, అంత నష్టం. ఈ కొత్తపాఠాన్ని నెమరు వేసుకుంటూ శర్మ చకచకా కారుషెడ్డు వైపు నడవ సాగాడు.



మర్నాటి నుంచి ఆమెకు మనస్సు కాస్త తేలిగ్గా వున్నట్టు తోచింది. తన హృదయంలో జరిగే పోరాటంలో కొంత భాగాన్ని శర్మకు చెప్పెయ్య గలిగింది...పాపం—అతను తనను గూర్చి ఏమనుకున్నాడో? అతనిలో జరిగే మార్పుల్ని కనిపెట్టాలని ఆమె కుతూహల పడ్డది; కాని ధైర్యం చాలలేదు.

రెండురోజులు గడిచాయి:

ఒకనాటి సాయంత్రం "అన్నట్టు మరిచిపొయ్యాను, రేపు నేను ఊరు వెళ్ళాలి" అన్నాడు భర్త.

"ఏ వూరు?"

"మా వూరు..."

"ఎన్నాళ్ళ పని?"

"ఐదు రోజులు"

ఐదు రోజులపాటు ఒంటరిగా బతకటం ఎంతకష్టం! అందులోనూ యీ మనోవ్యథతో వేగిపోతూన్న సమయంలో! ఎట్లాగైనా ఈ శర్మకూడా భర్తతోపాటే యిక్కడ లేకుండా పోతే కొంతనయమే!

"కారు తీసుకు వెళ్ళరూ?"

"ఉహుఁ...రైల్లోనే—"

ఆమెను మళ్ళీ కొత్తరకం భయం వెన్నాడ సాగింది. ఇప్పుడిక భర్త రక్షణకూడా లేకుండా, యీ బంగళాలో ఐదురోజుల పాటు, తను విరోధిని తప్పించుకు తిరగాలి! భర్తతో తను వెళ్ళేందుకూ వేల్లేదు! అంటే తనను తనే కాపాడుకోవలసిన క్షణాలు వచ్చా యన్నమాట! జీవితం ఇలా సుడిగుండాల్లో పడు తుందని ఎవ రనుకున్నారు?

తెల్లారి ఆమెమేల్కొనేటప్పటికే, భర్తవెళ్ళిపొయ్యాడు—ఆమె తన గదిని వదల దలచుకో లేదు. బైటిప్రపంచాన్నంతటిన్నీ మరిచిపోయి, యీ నాలుగు గోడల మధ్యనే కూర్చొని, మన శ్శాంతికి తపస్సు చెయ్యాల్సి వచ్చింది.

ఒక్కొక్క నిమిషం ఒక్కొక్క గంటలాగు తోచింది. కాలపు విలువా, దాని భారమూ, నిజంగా తెలుసుకో గలిగే క్షణాలు, జీవితంలో కొన్నేనేమో? రోజులు గడవటమే సమస్యయితే, ఈ జీవితాన్ని ఏం చేసుకొనేటట్టు? ఎంత సేపని ఆ భరించరాని నిశ్శబ్దదేవతను ఆరాధించటం? గొప్ప ఇంటి గృహిణి కావటం వల్ల—ఇంటిపనులు కూడా లేక, ఇన్నాళ్ళూ ఆమెలో పెరిగి కూర్చున్న సోమరితనం కూడా ఇప్పుడు బాధించ సాగింది.

సాయంత్రానికి కుర్రాడు ఎప్పుడు వచ్చి పడుకున్నాడో కాని, అలసి నిద్రపోతున్నాడు. ఐనా వీడికి శర్మతో ఇంత స్నేహ మేమిటి? తనలాగే లోకమంతా ఎందు కుండలేదో ఆమె ఆలోచ నకు తెలియ లేదు. ఇంకా ఆలోచించాల్సిన విషయా లేము న్నయ్? పుస్తకాలు చదివే ఓపికా ఉత్సాహము ఆమెకు లేదు; ఒకవేళ చదివినా ఆమెను "ఎంటర్టైయిన్" చేసే సాహిత్యం బహుకొద్ది!

అలా బైటికివెళ్ళి కాస్త చల్లగాలి పీలుస్తే? ఈ బంది ఖానా నుంచి తప్పకుండా తనకు కొంతసేపైనా విముక్తి కలగాలి. కాని బైటి ప్రపంచంలోకి మాత్రం, ఆమె వెళ్ళే స్థితిలో లేదు. ఈ బంగాళాను ఆవరించుకొన్న తోటలోకి వెళ్ళి, కాసేపు తిరిగివస్తే! తనఇంటి ప్రహరీలోనే నాయె...ప్రమాద మేముంటుంది? కుర్రాణ్ణి లేపకుండానే; ఆమెధైర్యం చేసి వెళ్ళింది. ఒకగంటదాకా తిరిగి తిరిగి వచ్చింది. ఆ గంటసేపు మాత్రం ప్రకృతి కొంతవరకూ ఆమెను ఓదార్చ గలిగింది.

ఈ మనశ్శాంతి వచ్చే మార్గాన్ని కనిపెట్టగానే, ఆమె మర్నాడుకూడా అలాగే వెళ్ళింది.

నాలుగోనాడు ఆమె తిరిగి రాబోతుండగా, 'కళ్యాణీ!' అన్న పిలుపు వినిపించింది. ఆమె ఉలికి పడ్డది. చూస్తే—శర్మ. ఏ ప్రమాదమైతే రాదని ఆమె నాలుగురోజుల అనుభవం మీద తేల్చు కొనగలిగిందో, ఆ ప్రమాదమే ఎదురైంది! కొన్నిక్షణాల పాటు ఆమె అలాగే నిలిచిపోయింది......శర్మ! ఇదెక్కడి రూపం? అతని కళ్ళనుంచి వచ్చేకాంతి, తను నిలబడ్డ భూభాగాన్ని మంత్రించ గల్గినట్లుగా ఉంది. గట్టిగా అతను పీల్చివదలే గాలి చేసే శబ్దం, అతని హృదయాన్ని బైటికి నెట్టటంలోగల కష్టాన్ని చెప్పుకుంటోంది. తన ఇంటిదగ్గర, తనను ఇలా నిలవతియ్యటంలో అతని ఉద్దేశ మేమిటి? రెండు ఫర్లాంగుల అవతల వున్న నౌకర్ల కంట ఇది పడదుగాని—లేకపోతే ఎంత ప్రమాద మయ్యేది! ఇప్పుడు తన కర్తవ్య మేమిటి?

ఆమె ఆలోచన పూర్తి కాక పూర్వమే శర్మ అందుకున్నాడు: "...జ్ఞాపకం లేవా ఆ రోజులు? ఇలాగే చంద మామ ఉదయించి, చెట్లచాటునుంచి తొంగి చూస్తూన్నా లెక్క

వెయ్యకుండా—మనం మన నీడల్ని సయితం ప్రేమించు కునే వాళ్ళం. ఆ రాత్రులు—వెన్నెల విలువ కట్టగలిగిన ఆ రాత్రులు! మరిచి పొయ్యావా కళ్యాణీ? మరిచిపో గలిగావా?... మాట్లాడవేం?''

ఇప్పటి శక్తులు అతి బలహీనమై, యీ మాటలు ఆమెను పన్నెండు సంవత్సరాల వెనక్కు లాక్కు పోగలిగినై. నిజమే! ఆ రోజులు—శర్మ అన్నట్టు అత్యంతానందకర మైనవి! కాని అవి గడిచిపోయినయ్. వాటినిగూర్చి ఇప్పుడు ఆలోచించటం కూడా అనవసరమే. అందులోనూ కొన్నాళ్ళ క్రితం వరకూ మరిచి పోగలిగిన తను!...అసలు ఇలా సంభాషణను మొదలు పెట్టడంలో శర్మ ఉద్దేశ మేమిటి? ఈ రోజులు కూడా ఆ రోజుల్లాగే మార్చుకునే అవకాశం వుందని సూచిస్తున్నాడా? అందుకే తనకు గతమంతా చెప్పి, తనను మభ్యపెట్టాలని చూస్తున్నాడా? జీవితపు యవ్వనదశ ప్రారంభంలో, మానవ మాత్రుడికి సహజంగా ఎదురయ్యే అగ్నిపరీక్షలో ఓడి, తన కోర్కెలకు బానిసై, ఓ క్షణిక దుర్బలత్వానికి లొంగిపోయి, ఈ జీవితమంతా బాధపడవలసిన స్థితికి వచ్చిందనే మాట లను ఆమె ఇంకా మరిచి పోలేదు. మళ్ళీ యీనాడు, ఆ అగ్ని గుండమే ఎదురై, నడి ఎడారిలో దాహానికి వెతుక్కునే పాంథుణ్ణి భ్రమింపజేసే ఎండమావుల్లాగు, దీపాన్ని పండుగా అపోహ పడే శలభంలాగు బెదిరిస్తోంది. మొదటిసారి తను కాలు జారి పడ్డ—అనుభవమే ఆమె కిప్పుడు సహాయంగా నిలబడ్డది. ప్రేమ అనేదాన్ని ఎలాగో ప్రసాదించి, విధి దానితో జీవితాన్ని ఎలా ఆడించ గలిగిందో తనకు తెలుసు కనుక, మళ్ళీ ఆ బుద్ధి తక్కువకు పోవటం తగిన పని కాదు.

అందుకనే ఆమె ఈ మాటలకు మొదట కాస్త చలించినా, చప్పున నిలవ తొక్కుకో గలిగి, "ఆ రోజుల సంగతి ఇప్పుడు దేనికి శర్మా! మళ్ళీ యీ భ్రమలో పడబోకు. నీ జీవితాన్ని ఇంతవరకూ లాగింది ఆ ప్రేమే! నీ కింకా జ్ఞానోదయమే అవ లేదా?" అంది.

శర్మ యీ మాటల్ని విననట్టే నటించి, తను అప్పజెప్పా ల్సిన పాత్రాన్ని జ్ఞాపకం చేసుకుంటున్నాడు; దాసీదాని చలవ వల్ల తను సంపాయించ గలిగిన యీ ఒక్క అవకాశమూ పోతే ఇక లాభం లేదు.

మెల్లిగా మొదలు పెట్టాడు. "కళ్యాణీ! స్త్రీకి కావాల్సింది ఒక్క ఐశ్వర్యమేనా? ఇష్టంలేని యీ భర్తతో ఎలా కాపరం చేస్తున్నావో, కోర్కెల్ని మూఢురాలిలాగా ఎంత హీనంగా చంపుకు బతుకుతున్నావో ఆలోచించు. నీకు పనికిరాని జీవితం—"

అతని మాట పూర్తికాక మునుపే ఆమె అంది: "నువ్వు చెప్పింది నిజమైనా—ఏ మానవుడికి కోర్కెలన్నీ తీరుతున్నయ్? చచ్చేనాటి క్కూడా తీరనివాంఛలు ఎంత అసంతృప్తిని ఇస్తయ్! ఒక్కటే ఆలోచించు: ఉన్నదాన్ని అనుభవించక, లేనిదాని కోసం దీన్ని కూడా పాడుచేసుకుంటే ఏం లాభం? ఒకసారి పగిలిన యీ హృదయాన్ని, ఎలాగో అతుక్కున్నాను. దాన్ని మళ్ళీ భేదించుకుంటే ఏం లాభం? ఈ స్వల్పజీవితానికి ఏ క్షణాని కాక్షణమే విలువైనప్పుడు, ఏం చెయ్యను? జీవి తంలో ఇలా బతికి బాధపడటంకన్న, చచ్చి సౌఖ్యపడదామనే తలపువచ్చిన క్షణాలు కూడా వున్నయ్. కాని చావ లేక పోయ్యాను. నీకు లేవా యీ అనుభవాలు?"

కళ్యాణి—అనాటి అమాయకపు పిల్ల...తన వలలోపడి,

తను చెప్పిందే వేదవాక్యంగా శిరసావహిస్తూ, తను తప్ప ఇంకో పురుషుడే లోకంలో లేడని నమ్మిన యువతి—యీ పన్నెండేళ్ళలోనే ఇంత విజ్ఞానాన్ని సంపాయించి, తనతో వాద నకు దిగుతుందని అతను అనుకో లేదు. జీవితంలోని బాధ ఎంత విజ్ఞానకాంతిని ప్రసాదించగలదో, అదెంత విలువైన వస్తువో, మెరిసే ఆమె కళ్ళల్లోంచి మెల్లిగా దారిచేసుకువస్తూన్న ఆ కన్నీటికే తెలుసు! కాని ఆమెకన్న ఎక్కువ జీవితాన్ని చూసి, ఎక్కువ బాధతో లోకంపోకడను బాగా అర్థం చేసు కున్న శర్మ తనపట్టును వీడలేదు.

అతను మాట్లాడేందుకు ప్రయత్నించేప్పటికే ఆమె గట్టిగా నిట్టూర్చి అంది: "శర్మా! నిన్ను నేను కోరానుగా—ఎక్కడి కన్నా వెళ్ళమని? వెళ్ళరాదా? ఇందువల్ల నీకు జరిగే హాని మాత్రం ఏముంది? ఒక ప్రాణిని రక్షించి నట్టవుతుంది గూడాను—"

"మరి నా జీవనం?"

"నేను డబ్బిస్తాను. డబ్బుకనక నీ జీవితాన్ని బాగుచేసి, నిన్ను సౌఖ్యపెట్టేదైతే, నీకు దాన్ని సమకూర్చి, నీ అభివృద్ధి కోసం దైవాన్ని ప్రార్థిస్తాను...నా చెడురోజులప్పుడు నన్ను చూసి బాధపడలేక, దేశాల పాలయ్యావు! నామీద ఇంత సానుభూతి చూపిన నీకు—నీ చెడురోజులప్పుడు విశ్వాసంతో సహాయం చెయ్యటం నావిధి..."

ఆమె మాటలు మళ్ళీ శర్మ హృదయాన్ని కదప సాగినయ్. ఎంత సానుభూతి! డబ్బు—డబ్బు విలువనూ, అది తీర్చగల ముఖ్యసమస్యల్నీ, తను ఇదివరకే గ్రహించాడు. కాని డబ్బే

క్కడే కాదు తనకు కావాల్సింది; ఆమె దయను తను అంగీకరించటం కూడా చాలా ప్రమాదమే !

"నీ మూలాన—ప్రకృతి బాధించగల బాధలన్నిటినీ ఎదుర్కొన్నాను. నీకోసం—ఇదంతా నీకోసమే!"

"ఆ నేరం నాదా ?"

"కాకపోవచ్చు. కాని యిద్దరి జీవితాల్నీ ఇప్పటికైనా పాడు చేసుకునేకన్న, బాగు చేసుకునేందుకు ప్రయత్నిస్తే?"

"అసంభవం !" అని పేలవంగా నవ్వింది కళ్యాణి.

"కాదు—నేను చెప్తాను విను: మనిద్దరం వెళ్ళిపోతే ? ఎన్నటికైనాసరే! భూభాగంమీది సౌఖ్యం - తెలిసిందా?"

ముందు తను నిలబడ్డ భూభాగమే కంపిస్తూన్నట్టు ఆమెకు తోచింది. శర్మ యేమన్నాడు? తనను - కులీనురాల్ని, తన మర్యాదనుకూడా పాటించకుండా;అనగలిగాడా ఆ మాటల్ని?... కాని శర్మ - తనను దేవతగా పూజించిన శర్మ, గడిచిన ఆ రోజుల్ని మరువలేక బాధపడుతూ, ఇంకా వాటిని పట్టుకు వేళ్ళాడుతూ, ఇలా మాట్లాడా డంటే ఆశ్చర్యం దేనికి ?

"శ—ర్మా" అంది, హెచ్చరిస్తూన్నట్టు కళ్యాణి.

"అవును. నేను చెప్పింది నిజం కాదా ? వెళ్ళి పోదాం. మనను మోసంచేసి, మనసౌఖ్యానికి అడ్డంపడ్డ యీ లోకాన్నే మోసం చేద్దాం. మనం బదికేందుకు—యీ విశాల విశ్వంలో చారెడంత మేర దొరక్కపోదు. ఆ సాధించగలిగే సౌఖ్యాన్ని, మళ్ళీ చేతులారా పాడుచేసుకోవడం దేనికి? ఒకవేళ మనం యిందులో గెలవలేకపోతే మాత్రమేం - ఇంతకన్న ఎక్కువ బాధకు గురికాము గదా ?"

ఆమె యీ మాటల్ని అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తోంది. కాని యీ రంగానికి ముందుగానే తయారైన శర్మ ఆమె కోర్కెల్ని కృత్రిమంగా రెచ్చగొట్టి, బాధపెట్టి - తన వైపు లాక్కోవాలని ప్రయత్నిస్తున్నాడు.

"నీకు జ్ఞాపకంలేదా కళ్యాణీ, నాపొడుగాటి పేరును మార్చి 'శర్మ' అని పిలుస్తానన్నావ్. అదే పేరుతో ఇన్నాళ్ళూ గడిపాను. నువ్వుపెట్టిన ఆ పేరు కూడా, నాకు అంతమధురమైంది. కళ్యాణీ! యింకాగుర్తుకు తెచ్చుకో. ఒకనాడు ఏమన్నావ్? నేను నడిచిన భూమిని కూడా ముద్దు పెట్టుకోవా లనిపిస్తోం దనలేదా? నీ పొడుగాటి విగ్రహంముందు, తన ప్రాణాన్నే బలిఇచ్చేందుకు సిద్ధమైన మహాభక్తుడిలాగు నేను నిలబడితే— నీ పెదవులే నా పెదవులకోసం తన్మయత్వంతో, వెదుక్కొనేవి. నీ మూర్తి, నీ శక్తులు, నీ ఆనందం-అంతా వేరొకలోకం లోని వాటిగా నిన్ను భ్రమింప చేసిన క్షణాలు - మళ్ళీ అవి వద్దా? వీళ్ళందరికీ భయపడి వదలుకుంటావా? నే నిలా నిలబడితే చిన్న పిల్లాణ్ణి బుజ్జగించినట్టు నన్ను లాలించావ్—"

ఆగాడు, మళ్ళీ ఆ పని ఇప్పుడామె చేస్తుందేమోనని. కాని ఆమె యీసారి అంత 'బుద్ధితక్కువ దశ'కు వెళ్ళ లేదు. ఆమెలో విద్యుత్ ప్రవాహం లాంటిది ప్రవహిస్తోంది. అది యీలోకం తాకిడిని దరి జేరనివ్వదు. నిర్లక్ష్యంగా నవ్వేందుకు ప్రయత్నించి అంది: "చాలు-శర్మా! ఇదా నువ్వు చెప్పాల్సింది? ఇప్పుడు ఇక్కడ నిలబడ్డ కళ్యాణి ఎవరనుకున్నావ్? యువతిగా నీకోసం ఆరాటపడ్డ కళ్యాణి కాదు. తల్లిగా మారిపోయిన కళ్యాణి! ఈ హృదయంలో మాతృత్వానికి తప్ప ఇంక దేనికీ తావు లేదు. కోర్కెలకు కీలుబొమ్మలైన రోజులు పోయినై. పోయినా ఇబ్బంది

లేదు. గడచినరోజులే మంచివి. ఎందుకంటే, కష్టమో, సుఖమో మళ్ళీ అవి జీవితంలో తిరిగి రావు!''

శర్మ యీ ధోరణిని కనిపెట్టాడు. ఇదివరకే తను కంఠో పాఠంగా చెప్పుకున్న మాటలు లాభం లేవు. తన వాదనలను, తను మభ్యపెట్టడమూ, మొదలైనవి ఆమెదగ్గర పనిచెయ్యావు. తనను ఆమె ఇంకా ప్రేమిస్తున్నా, తన పైన సానుభూతి చూపు. తున్నా—ఆమె తను పన్నిన ఆ వలలోకి రావటం లేదు...ఇక మిగిలిన ఒక్క అస్త్రమూ—తన ఆశలన్నింటినీ కేంద్రీకరించు కున్న ఆయుధాన్ని ప్రయోగిస్తే తప్ప ప్రయోజనం లేదు. అటో ఇటో తేలక పోతే, తన బతుకే ఒక సమస్య అవగలదు.

అధికార స్వరంతో శర్మ "కళ్యాణీ! నా మాట వినవా?'' అన్నాడు.

"నువ్వు నా మాట వినకూడదా! ఇంకా చిన్న కుర్రాడి లాగు నువ్వు మాట్లాడుతూంటే నాకు ఆశ్చర్యంగానే వుంది-''

శర్మకు కోపం వచ్చింది. ఇంత వరకూ పొందిన అప జయాలన్నీ అతని పట్టుదలను రేపినయ్.

"చూడు—గుర్తుందా కళ్యాణీ?'' అన్నాడు తీవ్రంగా శర్మ.

"ఏమిటి?'' అన్నదామె శర్మవేపు ఓ క్షణం చూసి.

"నువ్వు నాకు రాసిన లేఖలు...మనిద్దరం కలిసి చాటుగా తీయించుకున్న ఫొటో ... నేను వాటి నింకా పారెయ్య లేదు. ఇన్నాళ్లూ నా జీవితంలోని మధురమైన రోజుల్ని చూసుకునేం దుకై, వాటిని ఉపయోగించుకుంటూ వచ్చాను. కాని యీ నాటికి మళ్ళీ ఆ మధురమైన రోజుల్ని సాధించేందుకై వాటిని ఉప యోగించుకుంటాను. జాగ్రత్త! నీ జీవితమంతా నా చేతుల్లో వుంది—''

ఈ మాటలతో కళ్యాణికి మూర్ఛ వచ్చి నట్టయింది. శర్మ ఏం మాట్లాడాడో మెల్లిగా అర్థం చేసుకుంది. తనను బెదరిస్తు న్నాడు. అతను అన్న మాటల్లో నిజం లేక పోలేదు. తన యీ కాపరమూ, యీ సౌఖ్యమూ - అన్నీ అతని పైనే ఆధారపడి వున్నాయ్. ఇప్పుడు తనకు ఏది దారి ?

"ఏమిటి?" అన్నది, నమ్మలేని విషయాన్ని దేన్నో విన్నట్టు.

"లేఖలు - ఫొటో !" ఎంతో వికృతంగా అన్నాడు శర్మ! నిర్లక్ష్యంగా — బిగ్గరగా నవ్వాడు.

ఆమె వల వలా ఏడుస్తూ, "శర్మా...నువ్వు నా సౌఖ్యాన్ని కోరటం లేదు. నేను నీకు ఏమి హాని చేశాను ? నన్నెందుకిలా బాధిస్తావ్ ? ఆ చిన్న వాణ్ని చూసైనా నీకు దయ కలగటం లేదా ?" అన్నది.

"దయా?" అని మరోసారి వికృతంగా నవ్వి, "నా మీద నాకే దయ లేదు !" అన్నాడు శర్మ.

"నా మీద కూడ దయ లేదా ? ఒక్క తప్పుకేనా యీ శిక్ష ? నీకీ ఓర్వలేనితన మెందుకు ?...చూడు శర్మా ! జీవితా నికి మూడురకాల బాధలు. ఒకటి : విధి చేసేది; దీన్ని తప్పించుకోలేము. రెండు : మనకు మనమే చేసుకునే హాని! కాస్త బాధను గంపంతగా యీ విజ్ఞానంతో విమర్శించుకొని బాధపడతాం...నాకు ఆ బాధ కూడా ఐ పోయింది. ఇక మూడోది : మనచుట్టూ వున్న మనుషులు కల్పించే బాధ ! కనీసం యీ బాధను తప్పించుకోవటమన్నా మన చేతుల్లోనే వుందిగదా ? ఇప్పుడు చూడు—నీకు జాలి వుంటే చాలు... శర్మా ! నేను నువ్వు అనుకునేటంత క్రూరురాల్ని కాను. హృద

యమూ రక్తమాంసాలూ వాంఛలూ నాలోనూ వున్నయ్... నిన్ను—పాదాలు పట్టుకుంటాను-నీకు సాధ్యమైనదాన్ని..."

"కాని నాకు దయ చూపేవాళ్ళే లేరే!" అన్నాడు శర్మ, ఆ "దయ"కు లొంగుతే తన గతి ఏమౌతుందో గ్రహించమన్నట్టు చూస్తూ.

"నీ సౌఖ్యంకోసం నన్ను నాశనం కమ్మంటున్నావా ?"

అతను పెద్దగా నవ్వి "మరి నీ సౌఖ్యంకోసం నేను నాశనమవలేదా ?" అని వెంటనే ఉద్రేకం తెచ్చుకొని, ఖంగుమనే కంఠధ్వనితో అన్నాడు; "అవన్నీ నాకు అనవసరం. ఇక నీ ఆటలు యీ శర్మదగ్గర సాగవు. ఇది మొదలు నీకు వారం రోజులు ఆలోచించే అవకాశం ఇస్తున్నాను. గుర్తుంచుకో. మళ్ళీ వచ్చే గురువారం నాటికి ఏం తేల్చుకుంటావో తేల్చుకో! నాకుఆత్మ అనేది నశించింది-జాగర్త !"

ఆమె తెలివి తెచ్చుకునే లోపలే శర్మ వెళ్ళిపోతున్నాడు. ఆమె గొంతెత్తి "శర్మా !" అని పిలిచింది. ఆమె కంఠధ్వని తప్ప ఇతర జవాబేమీ రాలేదు. శర్మ కనుచూపు మేర దాటిపొయ్యాడు.

ఆమె వెంటనే ఆ స్థలం వదలలేక పోయింది. తనలో ఏమీ చలనం లేనట్టే ఆమెకు తోచింది. శర్మతో జరిగిన ఈ సంభాషణ, అతురం అతురంగా జ్ఞాపకం చేసుకునేందుకు ఆమె ప్రయత్నించింది. కాని ఆమె బుర్ర అప్పటికే ఏ ఆలోచనా ప్రవేశించేందుకు ఖాళీ లేకుండా పోయింది...

దూరాన ఎక్కడో ఎనిమిది గంటలు కొడుతున్నారు. తను ఇక్కడ నిలబడి ఏం లాభం? ఆ ఇంట్లోకి వెళ్ళి—వెళ్ళ గలదా

తను? అందుకు బలమేమీ లేనట్టే ఆమెకు తోచింది...కాని తప్పని సరిగా ఎలాగో బరువైనకాళ్ళను ఈడ్చుకుంటూ ఇంట్లో ప్రవేశించింది. కాని కాళ్ళు ఒణికినయ్. గొప్పనేరం చేసి, మేక పోతు గాంభీర్యంతో తను వెళ్ళకూడని స్థలానికి వెళ్ళుతున్న ట్లుగా, ఆమెకు తోచింది. గుమ్మంలో నిలబడ్డ ఆమెను చూచి వంటవాడు "భోజనానికి వస్తారా?" అని అడిగాడు.

"ఉహు(" అని తలతిప్పి, చరచరా గదిలోకి వెళ్ళి పడు కుంది. ఉద్రేకము, బాధ ఆమెను చాలా అలసిపోయేట్లు చేసి నయ్. ఆ దశలో ఉన్నట్టుండి ఆమెకు నిద్రపట్టింది.



ఒక రాత్రివేళ ఆమెకు మెలకువ వచ్చింది. పక్క నెవరో తనకు అతి దగ్గరగా పడుకొని వున్నారు. తడివి చూసి కుర్రవాడని తెల్సుకుంది.

మెల్లిగా కళ్ళు తెరిచేటప్పటికి, గదంతా చీకటిగా వుంది. ఆమె గొంతుకూడా ఎండిపోయినట్టుంది. మెల్లిగా, లేని ఓపి కతో లేచి, లైటు వేసి, మంచి నీళ్ళు తాగివచ్చి, పక్కమీద కూర్చుంది. కుర్రాడు గాఢ నిద్రలో వున్నాడు—ఎంత హాయి! నిద్ర మన ఇష్టప్రకారం వచ్చేదైతే, జీవితంలోని బాధల్ని ఎంత తేలిగ్గా మరిచిపోవచ్చు! అదే శాశ్వత నిద్రయితే లోకు బేరం లాటిదే! కుర్రాడి జీవితం ఇంటి ప్రహరీగోడల్ని దాటి పోవడం లేదు కనుకనే, వాడి యీ జీవితానికి చెప్పుకోదగ్గ సమస్యే లేకుండా పోయింది. సమస్య! తనకు యీ సాయం త్రమే జీవితంలో - ఒక కొత్త సమస్య ఎదురైంది.

ఆ సమస్య విషయం జ్ఞాపకం రాగానే ఆమెకు భయం వేసింది. కిటికీలోంచి వీచే గాలి కూడా, ఆమెను భయపెట్ట గలిగింది. వెంటనే ఆమె కిటికీ రెక్కల్ని మూసేసింది. కాని అది చెయ్యగలిగింది-ఒక్క ప్రకృతి బాధను మాత్రమే తప్పించటం! ఇక యీ రాత్రికి నిద్ర వుండదు. గోడ గడియారం ఆమె చెవులు గింగురు మనేటట్లు రెండు గంటలు కొట్టింది.

ఆమె తలెత్తి గడియారం వైపూ,దానివక్కనేవున్న "శివాజీ" బొమ్మవైపూ చూసింది. ఆమె రోజూ ఎన్నోసార్లు ఆ బొమ్మ వైపు చూసేది. ఆ బొమ్మమీద ఆమెకు తీరని అభిమానం! కాని అదిప్పుడింక శివాజీ బొమ్మే కాదు...అది శర్మమొహం! ఆ గడ్డం, ఆ కళ్ళు, ఆ చూపు—అంతా శర్మే! చూడలేక ఆమె చప్పున మొహాన్ని అరచేతుల్లో దాచుకొని, తన ఆలోచనల్ని వేరొక దిక్కుకు తీసుకెళ్ళేందుకు ప్రయత్నించింది.

నిద్ర ఇంత వరకూ ఇచ్చిన విశ్రాంతికి మారుగా, ఇప్పుడు శ్రమను కోరింది. అదే ఆమె మళ్ళీ ఆలోచనలో పడటం.

సాయంత్రం శర్మ తనను బెదిరించాడు. యవ్వన వాంఛకు ఆలోచన లేకుండా- ఒక్క క్షణిక బలహీనత్వానికి లొంగబట్టే తను ఇంత అలుసైంది! తన బతుకు ఇలా అడకత్తెరలో పడుతుందని కలగన్నదా? తను యీ యింటినీ, యీ సౌఖ్యాల్నీ, యీ కుర్రాణ్ణీ వదిలి, అతని ఆజ్ఞలకు బద్ధురాలై, అతనితో వెళ్ళాలట! లోకంలో తను శాంతికోసం పోరాడి సాధించగలిగిన యీ కవచాను వదలటం అసంభవం! ఈ ఐశ్వర్యమూ, ఈ

తన పూర్వీకులు తెలివి తేటల్తో, కష్టనిష్టురాలతో ఇంతదూరం నిలబెట్టుకు వచ్చిన వంశమర్యాద నంతటినీ, తను ఒక్కర్తే యీనాడు నేలపాలు చేస్తే - కులీనుల ఇంటిరక్తం ప్రవహించే కుర్రాడి ప్రతి రక్తనాళమూ ఎంత ఉద్రేకంతో బాధ పడు తుంది! మంచిపేరుకు జీవితాలే చాలవేమో, కాని చెడ్డపేరుకు క్షణాలు సరిపోతాయి!

కుర్రాడివైపు చూసింది. "నన్ను విడిచి వెళ్తావా అమ్మా?" అన్నట్టు వాడి పెదవులు నిద్రలో కదలినయ్. వెంటనే ఆమె హృదయం ఎగిరిపడి "వెళ్తానా?... వెళ్ళను. వెళ్ళను నాయనా వెళ్ళను!" అని గొణిగింది కళ్యాణి.

కాని వెళ్ళక పోతే ? శర్మ ఎంత క్రూరంగా మాట్లా డాడు! గత సాయంత్రం వరకూ తనకు శర్మమీది అభిమానం పెరిగిపెరిగి ఒక్కసారిగా మాయమైంది. దానిస్థానే నీచవస్తు వుపై కలిగే హేయభావం ఉదయించింది...తను వదిలించు కోవా లనుకున్నా, తనను వదలని సమస్య ఎదురైంది! ఆ ఉత్తరాలూ, ఫోటో, భర్తచూస్తే - తనకిక యీ కప్పుకింద స్థానం ఉండదు. తనవల్ల తన కుమారుడి గతీ అంతే! ఏ పాపమెరుగని పసిపాపకు కూడా ఇది హానికరమే! తనను క్షమించేవాళ్ళు లేరు. ఇంతమంది పుణ్యాత్ముల మధ్య, తను పాప కళంకితయై బతకాలంటే ఎంతకష్టం!

పోనీ, తను ఆత్మహత్య చేసుకుంటే? తనకిక యీ సమస్యే ఉండదు; అంతే కాదు, తను సమస్యగా నిలబడ్డ ముగ్గురికీ— శర్మకూ, భర్తకూ, కొడుక్కూ కూడా, సమస్య ఉండదు; లోకానికి మాత్రం తను మామూలుగా మంచి

చావును ఎదుర్కొన్న పుణ్యాత్మురాలే అవుతుంది. కాని చావట మనేది అంత తేలికైంది కాదు...ఇదివరకు ఏవో సందర్భాల్లో నాలుగైదుసార్లు తను సన్నాహం చేసి విరమించుకుంది కూడాను. ఈ ఆశలూ, యీ కోర్కెలూ—లోకంలో అక్కడక్కడ వెదజల్లబడి మభ్యపెట్టే యీ సౌఖ్యమూ - వీటన్నింటినీ వదులుకోవటం మాటలా ? చావు దానంతట అది వస్తేనే మందులూ మాకులూ వేసి తప్పించు కోవాలని చూసే మానవ మాత్రురాలు తను ! మంచిరోజులు చూస్తూన్న నాడు, ఇంకా మంచిరోజులు చూడాలనీ, చెడురోజులు చూస్తూన్నప్పుడు, మంచి రోజులకోసం ఓపిగ్గా వేచి కూర్చోవాలనీ తను అనుకొంటుంది. కాని చావును కోరుకో లేదు. ఏవో బాధలున్నాయని జీవితాన్ని ముగింప చేసుకోవడం పిరికితనం ! ఈ బాధలు మరుక్షణంలో విచ్చి పోవచ్చు. అలా ఐతే కనీసం పశ్చాత్తాప పడేందుకైనా - యీ ప్రాణి మళ్ళీ తిరిగిరాదు గదా!

ఈ సమస్య, ముందు గొయ్యి, వెనుక నుయ్యి లాగుంది. ఇది యీ జన్మానికే తీరదేమో ? తీరక పోయినా కాలం మాత్రం ఆగదు. మరి ఆరు రోజులకే తన బతుకంతా బైట పడుతుంది. తనదారిన పోతూన్న తనను, శర్మ ఇలా బాధించటం దేనికి? ఇది బలాత్కారమైనా ఇంత బాధ ఉండేదికాదు...తన అయిష్టతను ఇష్టతకు మార్పించే శక్తి ప్రయోగింప బడటమే దీన్ని భరించలేని బాధగా చేసింది !...కాని కంట తడిపెట్టిన లేడి మీద ఏ వేటగాడికి జాలి కలుగుతుంది గనుక !

"క - ళ్యా - ణీ !"

ఆమె ఉలిక్కిపడి తలెత్తి చూసింది. ద్వారంలో భర్త

నిలబడి తనవైపు చూస్తున్నాడు. ఎంత సేపైందో అత నలా నిలబడి? వెంటనే వాడిన ముఖాన్నీ, కన్నీరు ప్రవహించే చెక్కిళ్ళనూ, పమిటచాటున దాచుకుంది. కాని తప్పుచేసి దాన్ని కప్పివేసేందుకు, వేషం వేస్తూన్న దుర్మార్గమైన ఆత్మ ఆమెను పిండుతూనే ఉంది.

"తెల్లవార్లూ ఇలా ఆలోచిస్తూనే ఉన్నావా ?"

అతని కంఠంలో కఠినత్వం లేదు ; తనమీద ఆదరణా. జాలీ మేళవిస్తున్నయ్. ఇంత దయను భరిస్తూ, తనెలా బతక గలుగుతోంది? ఆమె మాట్లాడేందుకు ప్రయత్నించే లోపలే, ఆమె ముఖాన్ని తన చేతుల్లోకి తీసుకొని, ఆమె తడికళ్ళలోకి చూస్తూ ప్రసాద్ అన్నాడు : "ఏమిటి నీకిపిచ్చి? నీకు వచ్చిన కష్టమేమిటో చెప్పు. ఎందుకు బాధ పడుతూన్నట్లు? రాత్రి భోంచెయ్య లేదటగా? ఒంట్లో బాగాలేదా? నేను పదిరోజుల్నుంచీ నీలో క్షణక్షణానికీ మార్పును స్పష్టంగా చూడగలుగు తున్నాను. అందుకు కారణాలు నాకు బోధపడలేదు. అవేలాంటి బాధలో కనీసం నేను వినవచ్చుగా—!"

ఆమె జవాబు చెప్పలేక పోయింది. ఏమని చెప్పకుంటుంది? తన భర్త పవిత్రంగా తనను పరిగణిస్తూ ఇంకా ఆదరిస్తూనే ఉన్నాడు. ఎంత అమాయకుడు! ఎంత ఉత్తముడు! చప్పున తెలివి తెచ్చుకొని, మాటల ధోరణి మార్చాలని "మీ రెప్పుడొచ్చారు?" అంది, దుఃఖచ్ఛాయలు పోని కంఠంతో.

"రాత్రి-" అని, కాస్త ఆగి "నేను అడిగిందానికి జవాబు చెప్పవా కళ్యాణీ?" అన్నాడు ప్రసాద్.

ఆనందాన్ని నటిస్తూ, నవ్వేందుకు వ్యర్థప్రయత్నం చేసి, ‘‘ఏం లేదు—కడుపులో నొప్పిగా వుంది—’’అన్నది.

ప్రసాద్ దీన్ని నమ్మినట్లు, ఇంకేమీ అడగకుండానే వెళ్ళి పొయ్యాడు. భర్తను చూసి ఆమెకు కలిగే వేరొక దుఃఖంతో ఆమె మళ్ళీ బాధపడ సాగింది.

ఉదయం తొమ్మిదైనా ఆమె మంచం వదల లేదు. అసలు ఆ ఆలోచనే ఆమెకు కలగ లేదు. సరిగ్గా యీ సమయానికే భర్త డాక్టర్ను వెంటపెట్టుకొని ఆమె గదిలోకి వచ్చాడు. ఆమె చప్పున లేచి నిలబడ బోయింది. కాని డాక్టరు అప్పుడే ఆమె మంచం పక్కన నిలబడి, కొంత సేపటివరకూ ఏమీ మాట్లాడకుండానే రోగిని పరీక్షించ సాగాడు. డాక్టరు ఎందుకు వచ్చాడో, యీ డాక్టరు కుదర్చగల తన వ్యాధియేమిటో, ఆమెకు తెలియ లేదు. డాక్టరు అడిగిన ప్రశ్నలేమిటో, తను ఇచ్చిన జవాబు లేమిటో ఆమెకు జ్ఞప్తి లేవు.రోగిలాగే డాక్టరుకు కూడా ఈ వ్యాధి అంతు పట్ట లేదు.

గదివిడిచి రాగానే ప్రసాద్, ‘‘ఏమి?’’ టన్నాడు.

‘‘నాన్ సెన్స్’’ అన్నాడు డాక్టరు.

‘‘ఏమిటీ ?’’ అన్నాడు ప్రసాద్, అర్థంకాక.

‘‘నాన్ సెన్స్...అంటే కొంతమంది ‘‘నాన్ సెన్స్’’ అనే వ్యాధితో బాధపడు తూంటారు !’’

ప్రసాదుకు నవ్వు వచ్చింది కాని, నిజంగా విషయాన్ని అర్థం చేసుకోకుండా నవ్వే అలవాటు అతనికి లేదు.

"నాకు కాస్త తెలిసేట్టు చెప్పండి" అన్నాడు. ఈసారి డాక్టరు నవ్వి, "అంటే, శారీరకంగా యేమీ లేదు" అన్నాడు.

"ఆఁ" అన్నాడు ప్రసాద్.

"అషను...ఏమీలేదు. అది దొంగవేషమన్నా కావాలి. మానసిక సమస్యయినా కావాలి. మందులకు లొంగేది మాత్రం కాదు."

"అంతేనా ?"

"అంతే ! మానసిక బాధ కొంతవరకూ బాహ్యంగా శ్రమపెట్టి, ఆరోగ్యాన్ని పాడు చేస్తుంది. అంతవరకే మందులు... ఈ రకం జబ్బులు చాలా ప్రమాదం. కాస్త మనసు కనిపెట్టి ప్రవర్తించటం అవసరం...సరే—మందు పంపుతాను—" ప్రసాద్ ఆలోచన పూర్తికాకపూర్వమే డాక్టరు వెళ్ళిపొయ్యాడు.

అతనికి మతిపోయినట్టయింది. ఇదేదో సామాన్య విషయమని ఇంతవరకూ చూసీ చూడనట్టు ఊరుకున్నాడు. డాక్టరు మాటలు విన్నాక భార్య ఆరోగ్యం విషయమైన అదుర్దా అతనిలో అధికమైంది. ఆమెగదిలోకి వెళ్ళి, ఆమె మంచంమీద కూర్చొని, ఆమెచేతులు పట్టుకొని ప్రార్థనా పూర్వకంగా అన్నాడు, "నీ మనస్సులోని మాటేమిటో బైటపెట్టు. ఇది మందులేని మనోవ్యాధి. అసలు విషయాన్ని దాచి నీకు నువ్వే బాధపడి కుంగిపోతూ నన్నూ, కుర్రాణ్ణి కూడా అన్యాయం చెయ్యకపోక...చెప్పవా కళ్యాణీ ?"

"ఏమీలేదు...ఏమీలేదు" అంటూ పట్టరానిదుఃఖాన్ని ఆపుకోలేక, తలగడాలో ముఖం దాచుకొని ఏడ్వసాగిం దామె.

ప్రసాద్ ఆమెను చిన్నపిల్లాణ్ణి బుజ్జగిస్తూన్నట్టు వీపు తట్టుతూ,

"ఏమీ ఫర్వాలేదు...కళ్యాణీ! ఎందుకు ఏడుపు? నాతో చెప్పవూ?" అన్నాడు. ఆమె ఏడుపు ఆపుకునేందుకు చీరె కొంగు నోట్లో పెట్టుకుంది. ప్రసాద్ ఆమెకళ్ళు తుడుస్తూ, "ఫర్వా లేదు...ఏం ప్రమాద ముందనీ? చెప్పు...కాసిని మంచినీళ్ళు కావాలా?" అన్నాడు.

ఆమె దుఃఖం భేదించే మాటల్తో సమాధానం చెప్పింది: "ఏం లేదు...మీ పాదాలమీద పడతాను—మీరు వెళ్ళండి. నాగూర్చి మీరు బాధపడే అవసరం కూడా లేదు. ఏంలేదు—నన్ను ఒంటరిగా ఉండనివ్వండి. నాకు నేనై మనశ్శాంతి తెచ్చుకునేందుకు ప్రయత్నిస్తాను."

ప్రసాదుకు కోపం వచ్చింది. తనదగ్గర దాచాల్సిన రహస్య మేమిటి? తన మీదకూడా ఆమెకు నమ్మకం పోయిందా? కళ్యాణి మీద అతిశ్రద్ధ తీసుకోవాల్సిన అవసరం ఆ క్షణాన ఏర్పడ్డట్టుగా, వెంటనే గది విడిచి వెళ్ళిపొయ్యాడు.

ఐదు రోజులవరకూ ఆమెస్థితి రోజురోజుకూ కిందికి దిగజార సాగింది. థర్మామీటరు చూపలేని వేడి ఏదో, ఆమెను బాధించేది. ఆమె విడిచేలాటి నిట్టూర్పుల లక్షణాలు గల వ్యాధి ఏమిటో కూడా ఇప్పటి శాస్త్రజ్ఞానానికి అందేది కాదు.

ఎంతసేవకైనా నోచుకున్న ఆమె, ఏ సేవనూ అంగీకరించ లేదు. కొడుకును కూడా ఆటలకు వెళ్ళమని ప్రోత్సహించ సాగింది. ఒక్కతే ఆగది గోడలమధ్య శాంతి స్థాపన చెయ్యాలని వ్యర్థ ప్రయత్నం చేసేది.

టేబిల్ మీద సీసా పెట్టిన చప్పుడువిన్నది—కాస్త ఆగి తల

అటు తిప్పి ఆశ్చర్యపడ్డది. ఎదురుగా శర్మ తనను రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. ఇంకా దూరముందని భ్రమిస్తూన్న ప్రమాదం తనకు తెలియకుండానే దగ్గిరపడ్డది. తను భ్రమిస్తోందేమోనని గట్టిగా ఒకసారి కళ్ళుమూసుకొని తెరిచింది... శర్మే! తన మంచం దగ్గిరగా నిలబడి వున్నాడు, మృత్యుదేవతే ఆమెకు సాక్షాత్కరించినట్టయితే ఇంత భయపడేదికాదేమో?

ఎలాగో లేచి కూర్చునేప్పటికల్లా శర్మ అంటున్నాడు: "మందు...డాక్టరిచ్చిన మందు! అక్కడ–టేబిల్ మీద పెట్టాను"

"నన్ను బతకనివ్వవా శర్మా?" అందామె.

శర్మ వెనక్కు ఒక్కసారి చూసి, ఏప్రమాదమూ లేదని గుర్తించగానే అన్నాడు: "బతుకు! చూసుకో—నీ వ్యాధి కుదిరే మందు ఈలోకంలో నా ఒక్కడిదగ్గరేవుంది జాగ్రత్త! మరొక రోజులోనే తేల్చుకోవాలి సుమా!" అంటూ నవ్వాడు.

మొదట సముద్రం ఒడ్డున, రెండోసారి సినిమాకు వెళ్లినప్పుడు, మూడోమాటు తన ఇంటి ఆవరణలో, నాలుగోసారి తన గదిలోనే శర్మ తనను బాధించగలుగుతున్నాడు. అతను నవ్విన నవ్వు–కళ్యాణిలో ఇక మిగిలిన శక్తి ఇవ్వగల కోపాన్నంతటినీ రేకెత్తింప జేసింది.

"ఆఁ ... శర్మా! ... వెళ్ళు ... ముందు నా యెదుటనుంచి వెళ్ళు!" అని అరిచింది.

"అరవవోక; నీకే నష్టం. జాగ్రత్త—నాదగ్గిర..."

ఇక చెప్పటం అనవసరమన్నట్టు, ఎదుట వ్యక్తిని కట్టేసిన

సంతోషాన్ని సూచించే నవ్వు—కత్తులకన్న కరుకైన కంఠంతో నవ్వుతున్నాడు.

ఇదే సమయాన ప్రసాద్ కుర్రాణ్ణి, ఎత్తుకొని గదిలో ప్రవేశించాడు. శర్మ వెంటనే నవ్వు మానాడు. అతనికి తను నిలబడ్డ భూమే కంపిస్తోన్నట్టు తోచింది. ఆమెకు తను బతికేవుందో లేదోననే అనుమానం కూడా కలిగింది.

శర్మ ఆపిన నవ్వును ప్రసాదు అందుకుంటూ, "ఏదీ శర్మా! మళ్ళీ నవ్వు!" అన్నాడు. కాని, శర్మ శక్తులన్నీ అతనికే ఎదురు తిరిగినయ్.

కుర్రాడి చేతులోని కట్టను తీసుకుంటూ ప్రసాద్ అన్నాడు: "కళ్యాణీ! ఇవేవో ఉత్తరాల్లాగున్నాయ్. చాలా పాతవనుకుంటాను. కారులో దొరుకుతే కుర్రాడు తీసుకొచ్చాడు—"

ఆమె ఆశ్చర్యంతో మూగపోయింది. శర్మ తన స్థితిని చప్పున తెలుసుకోగలిగాడు. తన చేతులోని అస్త్రం, తనకు నిరుపయోగమైనా, విరోధి చేతులోకి పోవటంవల్ల—ముందు అతని స్థితే ప్రమాదమైంది. శర్మవైపు తిరిగి ప్రసాద్, "ఇవ్వేమిటో నీకు తెలుసా శర్మా?" అన్నాడు.

శర్మ పెదవులు తడిచేసుకుంటూ, మెల్లిగా, "నావే!" అన్నాడు.

"ఏమిటివ్వి?"

"నా స్వంత—" అని ఆగాడు.

"చెప్పు" అని ప్రసాద్ గర్జించాడు.

శర్మ సంశయిస్తూ కళ్యాణివైపు చూశాడు. ఆమె వేరొక వైక్కు చూస్తూ ఏడుస్తోంది.

"అవి నావే...ఇచ్చెయ్యండి—" అన్నాడు శర్మ.

శర్మలో ఆ క్షణాన కళ్యాణిమీద గొప్పదయ కలిగింది. కాని, అది సమయం మించిపొయ్యాక యేర్పడటంవల్ల బయట పడే అవకాశమే దానికి లేక పోయింది.

"అట్లా ఇవ్వను - ఇవ్వేమిటో చెప్పు-" జడ్జీలాగే ప్రశ్నించాడు. శర్మ మాట్లాడక పోయేటప్పటికి మళ్ళీ అన్నాడు. "చెప్పవా? విప్పి చూ స్తేనైనా నాకు తెలియక పోతుందా?"

శర్మ యిక స్వరక్షణార్థం తప్పని సరిగా మాట్లాడాడు.

"అవి...ప్రేమ లేఖలు..." అన్నాడు, ఎలాగో.

"ఎవరు రాశారు?"

శర్మ మాట్లాడక నేల చూపులు చూశాడు.

"చెప్పు!" ఇక ఒక్కమాటలో కళ్యాణి జీవితరహస్య మంతా ఇమిడివుంది. ఇంతబతుకూ ఒక్కమాట విలువే అవుతుందని ఆమె ఎన్నడూ తలచ లేదు. ఉరి స్తంభానికి ఎక్క బొయ్యే నేరస్థురాలిలాగు ఆమెముఖం వెలవెల బోయింది.

"చె-ప్పు; నీవి నీకే ఇచ్చేస్తాను" అన్నాడు ప్రసాద్— హెచ్చరిస్తూ. శర్మ ఒక్కసారిగా చెప్పలేక, కళ్యాణి వైపు వేలు పెట్టి చూపాడు. ఆమె ఒక పెద్దకేక వేసింది. గది గోడలు కూడా ఆమెను నాలుగువైపులా ఒత్తిడిచేస్తున్నట్టు తోచింది. కాని వెంటనే నిలవ తొక్కుకొని అంది —

"అవును-నావే! చేసిన తప్పును ఇప్పటికైనా ఒప్పుకోక పోవట మేమిటి ? నన్ను బైటికి నెట్టండి. ఈ పవిత్రగృహంలో ఉండే అర్హత లేదు...కాని నా కుర్రాడు—ఏపాపమూ ఎరుగని వాణ్ణి మాత్రం అన్యాయం చెయ్యకండి—" ఇక మాటలు రాక ఆమె వలవలా ఏడ్వసాగింది.

"రామస్వామీ!"

దవాలా జవాను వచ్చి, యజమాని మాటకై వేచి నిలబడ్డాడు. ప్రసాద్ వందరూపాయిల నోటును శర్మకు యిస్తూ, "వెళ్ళు- నీకేం అధికార ముందని ఆమెనిలా బాధిస్తావ్ ? ఇది మొదలు ఈ యింటి చాయల కనిపించావా- జైలుకు పంపుతాను. నీకు నెల పూర్తి కాక పోయినా, మూడు రెట్లిస్తున్నాను. ఇక ఇక్కడ ఒక్క క్షణం కూడా ఉండొద్దు. స్త్రీని అర్థం చేసుకో లేని నీచుడికి జీవితం విలువేం తెలుస్తుంది ?...రామస్వామీ! వీణ్ణి బైటికి గెంటి రా—" అన్నాడు.

శర్మ తనను తను తెలుసుకునేటప్పటికే, ధూళితో నిండిన రోడ్డు మీదకు చేరాడు !

"నన్నుకూడా పంపెయ్యండి — నీచురాలు, పాపి; మీకు భార్యగా 'ఉండే అర్హతను ఎలా సంపాదించగలదు ? భూమాత మొయ్యగలిగినంత కాలం బతుకుతాను. ప్రకృతి దయచూపి నంత కాలమే జీవిస్తాను."

"కళ్యాణీ ! అవన్నీ ఇప్పుడు అనవసరం. నిన్ను క్షమించినా, శిక్షించినా అది నా చేతుల్లో వుంది. నువ్వొకప్పుడు తప్పు చేశావేమో ? కాని తప్పులు చెయ్యని మానవుడేడి ? ఒక్క

తప్పుకే బతికే అధికారమే లేకపోతే - లోకం అనేక శతాబ్దాల పూర్వమే ఖాళీగా వుండి వుండేది. నేను - ఏ అర్హతా లేని నేను, ఒక్క ధన సంపాదనే అర్హతగా నిన్ను వివాహ మాడాను. అందుకు ఇష్టం లేకున్నా, నువ్వు నన్ను భర్తగా ఒప్పుకున్నావు...ఏ/అధికారమూ లేని నా ఒక తప్పును, నువ్వు క్షమించి నా జీవితాన్ని వెలిగించావు. అందుకని ఇచ్చి పుచ్చు కోవటం లాగైనా, నీ తప్పును నేను క్షమించవచ్చుగా! ఈ భాగ్యానికి ఆరు రోజులు మంచాన పడటం దేనికి? పాపులు చరిత్రే లోక చరిత్ర - ఎందుకంటే, లోకంలో పుణ్యాత్ముల కన్న పాపాత్ముల సంఖ్యే ఎప్పుడూ అధికంగా వుంటుంది... ఇక యీ క్షమ నా చేతుల్లోదే ఐతే-దాన్ని ఇవ్వటంకన్న నాకు ఆనందమైంది ఇంకోటి లేదు...కళ్యాణీ! ఇక ముందు కొత్త జీవితంలో ప్రవేశిద్దాం!"

భర్త మాటల్ని ఆమె ఒక్కసారిగా నమ్మలేక పోయింది. ఈ అనుకోని పరిస్థితుల మార్పు, ఆమెను ఆశ్చర్య పరిచింది. ఇది కలైనా తను అమితానందాన్ని అనుభవించి ఉండేది!

"నన్ను నమ్మవా కళ్యాణీ? ఈ ఉత్తరాల్లో ఏముందో నేను ఇంతవరకూ చూడ లేదు-" అని ఆ చిన్న కట్టకు నిప్పు అంటించాడు. తన జీవనానికే ప్రయోగింపబడ్డ ఆ ఆయుధం బుగ్గి అవుతూండగా, కళ్యాణి మామూలు మనిషైంది. కాని ఆమె ఇంకా ఏడుస్తూనే వుంది గాని, అవి హృదయ భార మంతా తగ్గి వెలువడే ఆనంద బాష్పాలు. ఏ నీడ చాటున తను ఎన్ని జీవితాలైనా గడపగలదో, ఆమెకు యీ క్షణాన

అర్థమైంది. ప్రసాద్ ఆమెకు ఆక్షణాన భర్తగా కాక దైవరూపాన కనిపించాడు.

భర్త పాదాల్ని పట్టుకొని, ఆమె భరించలేని ఆనందంతో అతని ముఖంలోకి చూసింది. అతను ఆమెను లేవనెత్తి నవ్వుతూ, "కళ్యాణీ! ఆరు రోజుల్నుంచి కష్టపడి, వేటాడి సంపాయించిన యీ మందైనా నీ వ్యాధిని కుదర్చ గలిగింది, నాకదే చాలు." అన్నాడు, కొంటెగా.

ఆమె మాట్లాడ లేదు. కాని, కుర్రాడికి మాత్రం ఆ మందే మిటో, దాని ప్రభావం ఏమిటో ఏమీ అర్థమవనే లేదు.

—ఏప్రిల్, 1943.

ఐపోయింది



